మల్లె పూదండ
మా కన్న తల్లికి
మంగళ హారతులూ

కడుపులో బంగారు - కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు - దొర్లించు మాతల్లి

గలగలా గోదారి - కదలిపోతుంటే
బిరబిరా కృష్ణమ్మ - పరుగులిడుతుంటే

బంగారు పంటలే - పండుతాయీ
మురిపేల ముత్యాలు - దొర్లుతుంటాయీ

అమరావతీ గుహలలో - అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో - తారాడు నాదాలు
తిక్కయ్య కలములో - తియ్యందనాలు

నిత్యమై, నిఖిలమై - నిలచియుండేదాక
రుద్రమ్మ భుజశక్తి - మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి - కృష్ణరాయుని కీర్తి
మాచెవుల రింగుమని - మారుమ్రోగేదాక

నీ ఆటలే ఆడుతాం
నీ పాటలే పాడుతాం

జై తెలుగు తల్లీ!
జై తెలుగు తల్లీ!!
జై తెలుగు తల్లీ!!!

# (తెలుగుతల్లి)

## [ఆంధ్ర బాల సర్వస్వము]

★

రాసినవారు:

మాగంటి బాపినీడు

బి. ఎస్. సి. (కార్నెల్); ఎమ్. ఎస్. సి. (కాలిఫోర్నియా);

మదరాసు ఎసంబ్లీ సభ్యులు

సంపాదకులు: ఆంధ్ర సర్వస్వము.

★

1946

త్యాగరాయనగరము, మదరాసు 17.

వెల రూ. 2/-

తెలుగు బిడ్డలకు
తెలుగు వారికి

## ముందుమాటలు

1930 సం॥ తిరుచనాపల్లి జైలులో యుండగా ఆంధ్రుల గురించి వివిధవిషయాలు మంజూషగా విశాలాంధ్రయొక్క స్వరూపము చూప ప్రయత్నించి, 1942 ఆగస్టు అరెస్టుకు పూర్వము ఆంధ్ర సర్వస్వమును ఒక త్రోవకు తెచ్చి, అచ్చు మధ్యలో అరెస్టు కాబడితిని. ఎట్లో ధైర్యంతో నా అర్ధాంగి శకుంతల నేను అమరావతి జైలులో యుండగా పూర్తిచేసెను. ఈ ప్రచురణకు అఖిలాంధ్ర దేశ మిచ్చిన ఆదరణకు ధన్యుడను.

తెలుగుజాతి ఏకత్వానికి, తెలుగు వెలుగు చూపడానికి తెలుగు పిల్లలకు బొమ్మలద్వారా చిన్న పుస్తకం ఎందుకు వుండకూడదని ఒకరోజు అమరావతి జైలులో ఆలోచన తట్టింది. సర్వస్వంలోని బొమ్మలతోపాటు మరికొన్ని మాటలుకూడా చేర్చితే బాగుంటుం దనుకొన్నాను. మాటలు మాటలయి తెలుగుతల్లి క్రింద తయారైంది.

తెలుగు బిడ్డలకు తెలుగు వెలుగుచూపి విశాలాంధ్రదృష్టి వికసింపజేసి, రాబోయే ఆంధ్రరాష్ట్రాన్ని నడపుటకు భాద్యులుగా తయారుచేయుటకు సహాయపడుటయే తెలుగుతల్లి ఉద్దేశం.

ఏ దేశమేగినా, ఏ పీఠమెక్కినా, ఆంధ్రదేశము నాది, ఆంధ్రుడను నేను అను నిండు గర్వముతో చెప్పుకోవాలి అందరు. తెలుగు తల్లి, తెలుగు బాలురను తెలుగు బాలికలను ఇట్లు తయారుచేస్తే నేను ధన్యుడ నవుతాను.

బంగాళీ, గుజరాతీ, మరాఠీ భాషలలోవలె తెలుగులో పిల్లలకు పుస్తకాలు లేవు. వెంకటపార్వతీశ్వర కవుల పదాలు, చింతాదీక్షి

తులుగారి గేయాలు, వాచక కథలే మనకున్న బాల వాఙ్మయం. ఇప్పుడు 'బాల' పత్రిక పుట్టింది.

పిల్లల పుస్తకాలు ఎన్నో కావాలి. 'తెలుగు తల్లి'ని తెలుగు బిడ్డలు, బిడ్డల తలితండ్రులు తప్పక ఆహ్వానించి ఆదరించి, ఆనందిస్తారను ఆశతో కాగితము, అచ్చు చాలా ఖరీదైనా పూనుకున్నాను. జైలులో వ్రాసిన వాటికి జైలెందుకని ప్రచురణ ప్రారంభించాను. ఇంకా 'ఆంధ్ర వీరాంగనలు' 'రాలిన రత్నాలు' 'నారి' 'అమరావతి జైలు' మున్నగునవి అచ్చులోనికి రానున్నవి.

ఇది అచ్చునకు నిర్ణయించక పూర్వం పిల్లలకు పనివచ్చునో లేదోయని చింతాదీక్షితులుగారికి పంపి వారి అమూల్య సలహా తీసికొన్నాము. వారి తొలిపలుకుకు అనేక ధన్యవాదాలు.

నేను రాజకీయములోపడి తీరికలేక యున్నపుడు దీనికి అచ్చులోను అలంకారములోను అన్ని విధాల తోడ్పడిన 'బాల' సంపాదకులు న్యాపతి రాఘవరావుగారి సేవ మరువజాలము.

ఈ "తెలుగు తల్లి"ని ఆంధ్ర బాల బాలికలకు జాతీయ జ్ఞానమందిరము ద్వారా అందజేయగలందుకు గర్వపడుతున్నాము.

ఇట్టి గ్రంథమునకు ఇదే ప్రథమ ప్రయత్నం. ఇప్పుడున్న మంత్రులలో శ్రీ కోటిరెడ్డి, వీరాస్వామిగార్ల పేర్లు పొరపాటున అచ్చులో పడనందుకు విచారించుచున్నాము.

ఇందు సవరణలు అవసరమని తోచినచో పెద్దలు తెలియజేసిన సవరించుటకు సిద్ధమే.

ఆంధ్రుల ఆదరణవుంటే ఇటువంటి గ్రంథాలను ఎన్నో ప్రచురించుటకు అవసరమగు బలము - ఉత్సాహము తప్పక కలుగుతుందని మా ఆశయము.

సెలవా మరి.

ఇట్లు, సంపాదకుడు,

28-11-1946. మాగంటి బాపినీడు

# తెలుగు పిల్లలారా

ఇంతవరకు మీరు చదువుకోడానికి సరిఅయిన పుస్తకాలు అట్టే తెలుగులో లేవు. మీరు చదువుతూన్న వాచకాలు మీ పుస్తకాలు అనుకుంటారేమో! కావు సుమండీ. అవి గవర్నమెంటువారికోసం అదోభాషలో రాసిన పుస్తకాలు. పాపం మీచేత బలవంతంగా చదివిస్తున్నారు. వాటిలో ఏ కొద్దిగానో మంచివికూడా ఉండవచ్చు. మీ కోసం మొన్నమొన్నటిదాకా ఒక్కపత్రికకూడా లేదు. మొన్ననే 'బాల' అనే పత్రిక వచ్చింది. అది రావడం మీకు సంతోషమే. దానిని చదువుతున్నారా ?

మీకోసమని మీరు చదువుకొని బాగుపడాలని మీరు ఇష్టపడేవిధంగా రాసిన పుస్తకం ఇదుగో ఇప్పుడు వచ్చింది. మీరు దీనిని చేత్తోపట్టుకుంటే పూర్తిగా చదివిందాకా వదిలిపెట్టరని నేను అనుకుంటాను.

మంచి కాగితాలూ, మంచి అచ్చూ, మంచి రంగుల బొమ్మలూ, చక్కని విషయాలూ - మీరు తప్పకుండా తెలుసుకోవలసిన విషయాలు - ఇందులో ఉన్నాయి. ఇందులో భాష మీకు అర్థంకావాలని రాసిన భాష.

మొట్టమొదట మీరు మనదేశాన్ని గురించి తెలుసుకోవాలి. మన దేశం ఇండియా. దీనినే హిందూదేశం అనీ అంటారు. మనదేశం ఎంత పెద్దదో, మన దేశంలో ఎన్నిభాషలుఉన్నవో, ఎంతమంది ప్రజలున్నారో మీరు తెలుసుకోవాలికాదూ.

మనదేశంలో ఒక భాగం మన తెలుగుదేశం. మనం మాట్లాడే భాష తెలుగు భాష. మన తెలుగుదేశంలో ఎంతటి గొప్పనదులు ఉన్నాయో, పుణ్యక్షేత్రాలు ఉన్నాయో, ఎటువంటి వృత్తులూ పరిశ్రమలూ ఉన్నాయో, మీరు ఎటువంటి ఆటలు ఆడుకుని పాటలు పాడుకుంటారో మీరు తెలుసుకోవాలి, కాదూ.

మన తెలుగుదేశంలో ఎటువంటి గొప్పవాళ్లు పుట్టారో, ఏయేపనులు చేశారో కూడా మీరు తెలుసుకోవాలి కాదూ. మన తెలుగువాళ్లకోసం ఏయే కవులు ఏయే గ్రంథాలు వ్రాశారో మీరు తెలుసుకోవాలి కాదూ. ఇలాంటి విషయాలన్నీ తెలుసుకోగలందులకు మీకోసం ఈ "తెలుగు తల్లి" అనే పుస్తకం వచ్చింది. మీరు తప్పకుండా దీనిని చదివి, సంతోషించి ఇంకా ఇలాంటి పుస్తకాలు కావాలని గోల చెయ్యాలి. లేకపోతే మీకోసం ఎవరూ పుస్తకాలు రాయరు.

మన ఇండియాలోనే ఉన్న బెంగాలు దేశంలోనూ, అరవ దేశంలోనూ, కన్నడ దేశంలోనూ, హిందీ భాషలోనూ పిల్లలకోసం రాసిన పుస్తకాలు ఎన్ని ఉన్నవనుకున్నారు ? తెలుగు పిల్లలకి మీకుమాత్రం అన్నేసి పుస్తకాలు అక్కరలేదూ?

ఈ 'తెలుగు తల్లి' పుస్తకాన్ని రాసిన శ్రీ మాగంటి బాపినీడుగారే ఇంకా మీకోసం పుస్తకాలు రాస్తే బాగుంటుంది. మరి చదవండి ఇక పుస్తకం.

నర్సాపురం<br>
25-11-46

# జాతిసంపద వృక్షము

సంగీతం
శిల్పము
వైద్యము
న్యాయశాస్త్రము
విద్యాసంపలు
నాట్యము
ఆలయనిర్మాణం
సాహిత్యం
పరిశ్రమలు
వర్తకము
ఇ. నిజపరిశ్రమ
ఎగుమతులు.
వినోదములు
సరుకుల విడుదల
శాస్త్రపరిశోధన
వేదాంతము.




దేశమనియెడి దొడ్డవృక్షం - ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం - ధనం పంటలు పండవలెనోయ్ —గురుజాడ.






తెలుగు బిడ్డా ! నీవు పుట్టిన కొంతకాలానికి ‘అమ్మా’ ‘అత్తా’ ‘తాతా’ అనడం నేర్చుకుంటావు. మరి కొంత కాలానికి ‘అయ్యా’ ‘అక్కా’ ‘అన్నా’ అని ముద్దుగా పిలుస్తావు. ఇవన్నీ తీయని తెలుగుమాటలు. మీ అమ్మ, మీ నాన్న మాట్లాడే మాటలనే “మాతృభాష” అంటారు. అంటే “తెలుగు భాష” అన్నమాట. తెలుగు మాటలు మాట్లాడేవారందరు తెలుగువారు. వారు ఉంటూవున్నదేశం తెలుగుదేశం. దీనినే ఆంధ్ర దేశము అనికూడా అంటారు. తెలుగుదేశాన్ని మనం “తెలుగు తల్లి” అని పిలుచుకుందాం. మనతల్లికి మనం అందరం చేయెత్తి నమస్కరించాలి కాదూ !

మన నందరినీ కన్న మన తల్లిదేశం ఎలాంటిదో, మనం మాట్లాడే తల్లిభాష తెలుగు ఎలాంటిదో తెలుసుకోవాలి మనమందరం.

మీరు ఎప్పుడైనా మీ ఊళ్లో మీటింగుకు వెళ్లారా ? మీటింగులో “భారతమాతకీ జై” “మహాత్మా గాంధీకీ జై” అని కేకలు

వేశారా ? పోనీలెండి, విన్నారుగదు! మరి ఈ భారతమాత ఎవరు? గాంధీ ఎవరు ? మాత అంటే తల్లి అన్నమాట. భారతమాత అంటే ఏమిటో తెలుసా ? మన తెలుగు దేశాన్ని తెలుగు తల్లి అని పిలుచుకుంటున్నామా లేదా ? అలాగే మన తెలుగు దేశం లాంటి దేశాలు - అరవం మాట్లాడేదేశం, బెంగాలీభాష మాట్లాడే దేశం — ఇంకా ఎన్నోభాషలు మాట్లాడేదేశాలు ఉన్నాయి మన తెలుగుదేశం చుట్టూ. అవి అన్నీ కలిసి ఒక పెద్దదేశం అయింది, దానికి భారతదేశమని పేరు. మన తెలుగుదేశం ఈ భారతదేశంలో ఒకభాగం. భారతదేశంలో ఉన్న మనమందరం భారతీయులం. మనం ఎంతమందిమి ఉన్నామో ఎరుగుదువా ? అసలు ప్రపంచంలో ఉన్న మనుష్యుల్లో ఐదోవంతు ఉన్నాం.



మహాత్మాగాంధి

ఇంక మహాత్మా గాంధీ అంటే మన దేశంలోనే కాదు ప్రపంచంలో అందరికంటె గొప్పవాడు. మన అందరి మంచి కోసం పాటుపడతాడు. అందువల్లనే మన భారతదేశంలో ఉండే వారందరికీ

ఆయన అంటే ఎంతో ప్రేమ.

మన భారతదేశంలో దేవుడి గుళ్ళోకి వెళ్ళే హిందువులు ఉన్నారు. చర్చికివెళ్ళే క్రైస్తవులు ఉన్నారు. మసీదులకు పోయే మహమ్మదీయులు ఉన్నారు. హిందీ, బెంగాలీ, మరాటీ, తెలుగు, అరవం ఇంకా ఎన్నో భాషలు మాట్లాడేవారు ఉన్నారు. వీరందరు కలిసి ఉన్నదే మనదేశం. మనం అందరం ఈ పాట పాడుకో వాలి. విను ఎంతబాగుందో !

"ప్రపంచమందలి ప్రశస్తదేశం
భారతదేశం మనదేనోయ్
భారతీయులము మనమందరమును
భారతదేశం మనదేనోయ్."

బాగుందికాదూ ! ఇంకోపాట చెపుతాను విను.

"జగములందు కలదె నాదు - జన్మభూమి వంటిది
సకలదేశములకు రాణి - నాదు జన్మభూమి."

జన్మభూమి అంటే ఏమిటో చెప్పనా ? మనమందరము పుట్టినదేశము అన్నమాట. ఇది స్వర్గంతో సమానం. 'వందే మాతరం' అంటారే మీటింగులలోను, స్కూళ్ళలోను ; అంటే ఏమిటో తెలుసా ? 'నన్ను కన్నదేశమా ! నాతల్లీ ! నీకు నమస్కారమమ్మా !' అని.

మనం రోజూ భూమిమీద నడుస్తాం, ఆడుకొంటాం, పాడుకొంటాం, పరుగెత్తుతాం, పండుకొంటాం. తినడానికి పంటలు, పండ్లు, కూరలు పండించుకుంటాం. పండ్లకోసమూ, నీడకోసము చెట్లను పెంచుకుంటాం. అలాంటి ఈ భూమి వయస్సెంతో, ఎప్పుడు పుట్టిందో నీకు తెలుసునా? నీకు ఇప్పుడు 8 లేక 10 సంవత్సరాలు ఉంటాయి. భూదేవికి 40,00,00,000 సంవత్సరాలు.



భారతమాత

ఈ భూమి, సముద్రం, నదులు, చెరువులు, కొండలు కలిసి ప్రపంచం అయింది. ఇందులో అమెరికా, చైనా, జపాను, రష్యా, జర్మనీ లాంటివి ఎన్నో దేశాలు ఉన్నాయి. ఎందరో మనుష్యులు ఉన్నారు. రైళ్లలో తుపాకులు పట్టుకొని, కాకిగుడ్డలు తొడుగుకొని సిపాయిలు వెళుతూండడం నువ్వు చూశావు కాదూ! ఆకాశంలో పెద్ద పక్షిలాగ ఏదో చప్పుడుచేస్తూ పోతూ ఉంటే మీ అమ్మో, మీ అక్కో 'ఒరే బాబూ! విమానంరో! రా చూడు,' అని కేకలేస్తే చూశావు. మొన్న యుద్ధంలో జర్మనీ, జపాను,

ఇటలీ కలిసి అమెరికా, ఇంగ్లాండు, రష్యా దేశాలవారితో చేసిన యుద్ధాన్ని గురించి మీ పెద్దవాళ్లు చెప్పుకోవడం విన్నావుకాదూ! జర్మనీ, ఇంగ్లాండు ఇవన్నీ మన భారతదేశంలాంటి దేశాలే. ఇట్లాంటివి ప్రపంచంలో ఇంకా ఎన్నో దేశాలు ఉన్నాయి.




అయితే మన దేశంకూడా చాలా పెద్దది, గొప్పది సుమా! ఎంత గొప్పదిఅనుకున్నావు? ఇక్కడ ఎందరో గొప్ప ఋషులు, రాజులు, కవులు పుట్టారు. వేదాలు, గీత, భారతం, భాగవతం, వైద్య శాస్త్రం, గణితశాస్త్రం లాంటివి ఎన్నో గొప్ప పుస్తకాలు పుట్టాయి. గొప్ప మతాలు పుట్టాయి. బుద్ధుడు, అశోకుడు, నాగార్జునాచార్యుడు, శంకరుడు, రామానుజుడు, మధ్వాచార్యుడు, కృష్ణదేవరాయలు, రామకృష్ణ పరమహంస, తిలకు, వీరేశలింగంపంతులు ఇంకా ఎందరో గొప్పవాళ్లని కన్నది భారతమాత. వీళ్లందరు వెనక ఎప్పుడో ఉండేవాళ్లు. ఇప్పుడు గాంధి, రామన్, రాధాకృష్ణయ్య, నెహ్రూలు ఉన్నారు. వీరేకాదు-ఇంకా ఎంతోమంది గొప్పవాళ్లు ఉన్నారు మనదేశంలో, ఏమనుకొన్నావు మరి!

# మనదేశము ఎంత పెద్దది?

(రష్యాతప్పమిగతాయూరప్ అంతటికంటె పెద్దది)

ఫ్రాన్స్
జ 42,013,506
వి. 212,659

స్పెయిన్
జ.28,719177
వి.196607.

జర్మని
జ.65306130
వి 181699

ఇటలీ
జ42625000 వి.19764

యుగోస్లేవియా
జ.13934038
వి 95558

రుమేనియా
జ 18771645
వి 113884

ఆస్ట్రియా
జ 6759052
వి 34856

సూచన
జ. జనాభా
వి. విస్తీర్ణత
చ॥ మైళ్లలో

ఈ పటంచూడు. మన ఇండియాలో ఎన్నిదేశాలు పట్టినాయో! అప్పుయ్యో ఇంకా ఎంత జాగా ఉందో! మనదేశం ఎంతపెద్ద దేశమో ఇప్పుడు తెలిసిందా నీకు?

హిందూదేశంలో అనేకభాగాలు ఉన్నాయి అన్నాను కాదూ! అరవవారు, బెంగాలీలు, గుజరాతీయు, హిందీ మాట్లాడేవారు, కేరళలు, కన్నడులు అనేకమంది ఉన్నారు. ఒకేభాష మాట్లాడేవారు అందరూ ఒకేచోట వేరే ఉంటే ఎన్నోలాభాలు ఉంటాయి. అలా మన తెలుగు మాట్లాడేవారు ఉన్నచోటంతా వేరే ఒక భాగంగా ఉండాలని మనం ఎన్నాళ్ళనుంచో అంటున్నాం. కాని మనకు ఆ భాగ్యం పట్టలేదు. మనదేశంలో హిందుస్తానీ, బెంగాలీ, తెలుగు, అరవం, మరాఠీ, గుజరాతీ - ఎన్నోభాషలు ఉన్నాయని చెప్పాను కాదూ! తెలుగు మాట్లాడే మనం ఎంతమందిమి ఉన్నామో తెలుసునా? అందరికంటె హిందీ మాట్లాడేవారు ఎక్కువమంది. అందుకే మనం పెద్దవాళ్లం అయిన తరువాత హిందీ నేర్చుకోవాలి అంటాం. ఆ భాషవస్తే ఇండియా అంతా తిరగవచ్చు. హిందీ మాట్లాడేవారి తరువాత బెంగాలీవారి సంఖ్య ఎక్కువ. తరువాత తెలుగు మాట్లాడే మనది. అందుకోసమే మనదేశంలో ఇంకా ఎన్నో భాషలు మాట్లాడేవారు ఉన్నా అకాశవాణిలో హిందీ, బెంగాలీ, తెలుగు, ఉరుదు (సాయిబుల భాష), ఇంగ్లీషు (గవర్నమెంటు భాష) మాత్రమే ఉన్నాయి. చూశావా మన భారతదేశంలో మన తెలుగుభాష ఎంత ముఖ్యమైనదో!

## భా ష లు

హిందీ

బెంగాలీ

తెలుగు

మరాఠీ

అరవము

| | | మాట్లాడువారు |
|---|---|---|
| హిందీ | ... | 17,23,97,409 |
| బెంగాలీ | ... | 5,34,68,460 |
| తెలుగు | ... | 2,63,73,414 |
| మరాఠీ | ... | 2,13,61,399 |
| అరవం | ... | 2,04,11,652 |

# తెలుగు వెలుగులు

తెలుగు దేశపు
తెలుగు పిల్లలు
తెలుగు వెలుగులండి

తెలుగు బాలుడు
తెలుగు బాలికలు
తెలుగు సొమ్ములండి

—అన్న.

# ఆంధ్ర సామ్రాజ్యము

(క్రీ.శ. 200)



# మనదేశం



ఇప్పుడు తెలుగుదేశాన్ని గురించి తెలుసుకోమరి. పూర్వం తెలుగువారు హిందూదేశాన్ని పాలించారు. తెలుగువారిని గురించి వేదాల్లోను, భారతంలోనుకూడా వ్రాశారు. అంటే 4000 సంవత్సరాలకు పూర్వమే మనం ఉన్నామన్నమాట. ఇప్పుడు రాజేంద్రప్రసాదు ఉండే పాట్నానుంచి వల్లభాయ్ పటేల్ ఉండే గుజరాత్ వరకు, ఇటు దక్షిణాన తిరువాన్కూరులో ఉన్న ఇండియా చివరికొన కన్యాకుమారివరకు, హైదరాబాదువరకు, బందరువరకు అంతా తెలుగువారిదే.

కృష్ణానది ఒడ్డున శ్రీకాకుళంలోను, ధరణికోటలోను, గోదావరి ఒడ్డున రాజమహేంద్రవరంలోను, ఏలూరు దగ్గర వేగిలోను, కొండపల్లి, ఒరంగల్లు, కంచి, హంపి మొదలగు చోట్లను తెలుగురాజులు పాలించారు. దక్షిణాదిని తంజావూరు, మధుర, పుదుక్కోట అనే పెద్ద పట్టణాలు ఉన్నాయి. వాటిలో

పెద్ద మేడలు, కోటలు ఉన్నాయి. అక్కడ తెలుగు రాజులు పాలించారు. కృష్ణానది ఒడ్డున ఉన్న అమరావతి, ధరణికోట, నాగార్జునకొండ అనేచోట్ల పూర్వం పెద్ద పాఠశాలలు ఉండేవి. అక్కడికి అన్నిదేశాలనుంచి చదువుకోడానికి విద్యార్థులు వచ్చేవారు. నైజాములో అజంతాలో పెద్ద గుహలు ఉన్నాయి. ఆ గుహల్లో గోడలమీద ఇప్పటికీ మాసిపోని చక్కని రంగుల బొమ్మలు ఉన్నాయి. ఆ బొమ్మలలో కొన్ని మనవాళ్ల వ్రాసినవే. ఒకపెద్ద కొండలో గుళ్లు, గుహలూ చెక్కేవారు. చూడడానికి ఎంతో బాగుంటాయి! మీరు పెద్దవాళ్లు అయితే తప్పక చూడాలి. మీ బడిపిల్లలతోనో, మీ నాన్న, అమ్మతోనోవెళ్లి చూస్తురుగాని లెండి.



రుద్రమదేవి యుద్ధానికి వెళ్లుట

ఒరంగల్లులో రుద్రమదేవి అనే తెనుగురాణి ఉండేది. బాగా చదువుకొన్నది, యుద్ధంచేసి శత్రువులను ఓడించింది. ఇంకా నాగార్జునాచార్యుడు అనే పండితుడు ఉండేవాడు. ఆయన 120 సంవత్సరాలు బ్రతికాడు. గొప్ప వైద్యుడు. కళ్ల జబ్బులు నయం చేసేవాడు. 1800 సంవత్సరాల క్రిందట ఆయన ఉండేవాడు. గొప్ప బౌద్ధమత గురువు. ఆయనపేరుతో గుంటూరు మండలంలో నాగార్జునకొండ ఉన్నది. ఎన్నిదేశాలనుంచో ఆయనదగ్గరకు చదువుకోడానికి వచ్చేవారు. ఆస్పత్రుళ్ళు, ఇళ్లు ఇంకా ఉన్నాయి.

మన నదుల ఒడ్డున సముద్రపు ఒడ్డున రేవుపట్టణాలు ఉండేవి. రేవులంటే పడవలు, ఓడలు ఆగి సామాను, మనుష్యుల్ని



ఎక్కించుకొనే స్థలాలు. ఇతరదేశాలనుంచి ఓడలు సముద్రంమీద వచ్చి మన బందరు రేవునుంచి అద్దకపు బట్టలు, సన్నబట్టలు మొదలగు వస్తువులను చైనా, జావా, ఇటలీ, ఈజిప్టు, బర్మా మొదలైన దేశాలకు తీసుకొని వెళ్లేవి. బందరు రేవునుంచేకాదు శ్రీకాకుళం, కొత్తపట్టణం, అమరావతి, ఘంటశాల, భట్టిప్రోలు, పులికట్టు, కళ్యాణి మొదలైన రేవుపట్టణాలు ఎన్నింటి నుంచో మనబట్టలు, ఇతరవస్తువులు ఆ దేశాలకు ఎగుమతి అయేవి.

నీవు ఎప్పుడైనా విశాఖపట్టణం, కాకినాడ, నరసాపురం, బందరు వెళ్ళావా? అక్కడ పాత ఇళ్లు పెద్ద స్తంభాలతో ఉంటాయి. కొన్నిచోట్ల వాటిలో పెద్ద ఆఫీసులు, స్కూళ్లు, పోస్టాఫీసులు పెట్టారు. అవి దూరదేశాలనుంచి వర్తకులు మన దేశానికి వచ్చినప్పుడు కట్టారు. బందరులో ఫ్రెంచిపేట, తూర్పు గోదావరి జిల్లాలో యానాం అనే పట్టణాలు ఉన్నాయి. అక్కడ ఫ్రెంచి గవర్నరులు ఉన్నారు. అంటే పూర్వం ఫ్రెంచివారు మన దేశానికి వచ్చారన్నమాట!

మనదేశంలో సాయిబులు ఉన్నారు. మసీదులు ఉన్నాయి. మన తెలుగులో బజారు, శిస్తు, తహసీల్దారు, జిలేబి, లడ్డు అనే మాటలు ఎన్నో తురకమాటలే కదూ! ఎందువల్ల? కొంతకాలం తురకలుకూడా మనదేశాన్ని ఏలారు. అందువల్ల.

మరి ఇప్పుడు ఎవరు మనదేశాన్ని పాలిస్తున్నారు?

మీవాళ్లు ఎవరైనా జైలుకు వెళ్ళారా? మన నాయకుడు గాంధి మహాత్ముడు జైలుకు వెళ్లాడు. ఎందుకు వెళ్లాడో చెప్పు.

సముద్రాల అవతల మనకు చాలాదూరంగా ఒక చిన్న దేశం ఉంది. ఆదేశంలో ఉండేవారు ఇంగ్లీషువారు. ఇప్పుడు మనదేశాన్ని వాళ్లు పాలిస్తున్నారు. "అల్లా వీలులేదు. ఇది 'మా' దేశం, మేమే ఏలుకొంటాం. మీ దేశానికి మీరుపొండి" అన్నాడు మన గాంధి, అందుకు.

ప్రపంచంలో వున్న చాలాదేశాలకంటె మన భారతదేశం చాలా పెద్దది. భారతదేశంలో వున్న చాలా భాగాలకంటె మన తెలుగుదేశం పెద్దది. అయితే ఏమి? మనకేమి లాభం? ఎక్కడ చూచినా బీదవాళ్లు, బిచ్చగాళ్లు—ఎందుకిలావున్నాం? మీ మాస్టరు గారినో, నాన్నగారినో, అన్ననో అడిగిచూడు.




బ్రిటిష్
ఆంధ్రదేశములో
జిల్లాలు
ఉత్కళము
ఇంద్రావతినది
మధ్యరాష్ట్రములు
విజయనగరము
విశాఖపట్టణము
తూర్పుగోదావరి
గోదావరినది
హైదరాబాదుకు
కాకినాడ
నైజాము రాజ్యము
కృష్ణానది
పశ్చిమగోదావరి
అమరావతి
గుంటూరు
మచిలీపట్టణము
బొంబాయి
కర్నూలు
తుంగభద్రనది
బళ్లారి
గుంటకల్లు
బంగాళాఖాతము
పెన్న
నెల్లూరు
అనంతపురము
కడప
చిత్తూరు
మైసూరు
మద్రాసు
KSB






నువ్వు మదరాసు, కలకత్తా పేరులు విని ఉంటావు. మదరాసులో కలకత్తామెయిలు బయలుదేరి నెల్లూరు, బెజవాడ, ఏలూరు, రాజమండ్రి, విశాఖపట్టణం, విజయనగరం, బరంపురం పట్టణాలమీదుగా కలకత్తా పోతుంది. ఉత్తరాన అటు బరంపురం నుంచి దక్షిణాన ఇటు మదరాసు వరకు తెలుగుదేశం. ఈ పటం చూడు. తూర్పున పొడుగునా సముద్రం, ఉత్తరాన మధ్యరాష్ట్రం, పడమట హైదరాబాదు (నైజాం) మైసూరు సంస్థానాలు, దక్షిణాన అరవదేశం ఉన్నాయి.

ఒక ఊరునుంచి ఇంకో ఊరు వెళ్లాలంటే మనం దగ్గరైతే ఎడ్లబండో, జట్కాబండో ఎక్కి వెళతాం. దూరమైతే బస్సుమీద వెళతాం. ఇంకా దూరమైతే రైళ్లమీద పోవాలిగా! తెలుగుదేశం పొడుగునా ఉత్తర దక్షిణాలుగా మదరాసునుంచి కలకత్తావెళ్లే రైలు వున్నది. ఇంకా బెజవాడనుంచి గుంటూరుమీదుగా గుంతకల్లు, బళ్లారి, అనంతపురం, కర్నూలు వెళ్లడానికి చిన్నరైలు వున్నది. ఆ రైలే ఇటు సముద్రపు ఒడ్డున వున్న బందరుకు కూడా పోతుంది.

మదరాసునుంచి కలకత్తాకు, బందరునుంచి హైదరాబాదు, బెంగుళూరు నగరాలకు మోటారులు వెళ్లే పెద్దరోడ్లు వున్నాయి.

పూర్వం కాశీకి రైళ్ళు లేనప్పుడు బళ్ళలో వెళ్ళేవారు. కాలువలలో పడవలమీదకూడా వెళ్ళేవారు. భద్రాచలం ఎరుగుదువా? రాములవారి గుడివున్నది. రాజమండ్రినుంచి పడవలమీద వెళతారు అక్కడికి.



గోదావరి వంతెన

గుంటూరుగాని, రాజమండ్రిగాని వెళ్ళావా ఎప్పుడైనా? బెజవాడదగ్గర కృష్ణానదిమీద, రాజమండ్రి దగ్గర గోదావరి నదిమీద పెద్ద వంతెనలమీదుగా రైలులో వెళ్ళి ఉంటావు. ఈ రెండు మన తెలుగుదేశంలో పెద్ద నదులు. పడమట ఎంతో దూరాన్నుంచి వస్తాయి. వర్షాకాలం నీరు జారితే సముద్రంలోకి పోకుండా నదులకు అడ్డంగా పెద్ద గట్లువేసి నీరు నిలవచేస్తారు. వీటినే ఆనకట్టలు అంటారు. ఇలాగే నెల్లూరు దగ్గర పెన్నా నదికికూడా ఆనకట్ట ఉన్నది. కొండలమీద, అడవుల్లోను కురిసిన వర్షపునీరు అంతా బురదతో నదులలోకి వస్తుంది. ఈ బురదనీరు పొలాలకు చాలామంచిది. నదులలోంచి ఈ బురదనీరు కాలువలలోకి వస్తుంది. కాలవలలో పడవలు తెరచాపలు ఎత్తుకొనిపోతూ వుండటం




చూశావుకాదూ! ఆ కాలువల్లోంచి మన పల్లెటూళ్ళలోని చెరువుల్లోకి వస్తుంది. ఊళ్ళో వాళ్ళందరు త్రాగడానికి, స్నానం చేయడానికి, పొలాలకి, మొక్కలకి, వరిపంటలకి, చెరుకు పొలాలకి వెళుతుంది. పొలాలు పండుతాయి. మనకు పాడిపంటలు వస్తాయి. కడుపునిండా అన్నం తింటాము. పాలూ పెరుగు తాగుతాము. ఈ నదులలోని నీరు ఇంకా నూటికి 90 పాళ్ళు వృథాగా సముద్రానికి పోతున్నది. దాన్ని ఆపుజేసి పొలాలకు పెడితే ఇంకా ఎన్నో పంటలు పండుతాయికాదూ! అప్పుడు పేదవాళ్ళకు కూడా చవుకగా తిండిదొరకదూ మరి!

పల్లెలలో వుండే చిన్న చెరువులు కాకుండా కొండలమధ్య గట్టుకట్టి, పూర్వం మనరాజులు పంటలకోసం పెద్దపెద్ద చెరువులు

## కృష్ణాడెల్టా




కట్టారు. కంభం, పాకాల మొదలైనచోట్ల ఇలాంటివి ఉన్నాయి. కృష్ణా గోదావరి జిల్లాలలో కొల్లేరు అనే చాలా పెద్ద సరస్సు ఉన్నది. అక్కడ పూర్వం పెద్దపట్టణం ఉండేది అంటారు.

మనకు రోజూ వంటకు పొయిలోకి పుల్లలు కావాలికాదూ! పిడకలు కాల్చటం మంచిదికాదు. పేడ పొలంలో వేయాలి. మన ప్రయాణాలకు పనికివచ్చేబళ్ళు, పడవలు తయారుచేసుకోడానికి కర్ర కావాలి. మనం ఇళ్ళుకట్టుకోడానికి, స్కూలులో బల్లలు,

కుర్చీలు చేయించుకోడానికి కూడా కర్ర కావాలి. పెనపళ్ళు, కలాలు చెయ్యడానికికూడా కర్ర అవసరమేగా! నీవు వ్రాసుకునే కాగితాలు కూడా వెదురు కర్రతోను, గడ్డితోను చేస్తారు. ఈ కర్రంతా అడవులనుంచి వస్తుంది. అడవులలో మొక్కలు వాటి అంతట అవి మొలిచి, వర్షంవల్ల పెరిగి పెద్దవై గజిబిజిగా వుంటాయి. వాటిలో పులులు, పాములు, పందులు, పిట్టలు వుంటాయి. చింత పండు, కరక్కాయ, మందులు, తేనె, జిగురు, విస్తళ్ళు ఇంకా ఎన్నోవస్తువులను ఇస్తాయి - మనకు ఈ అడవులు. చూశావా! అడవులు ఉంటే ఎంతలాభమో! ఇటువంటి అడవులు మన విశాఖపట్టణం, గోదావరి, కర్నూలు, చిత్తూరు జిల్లాలలో ఉన్నాయి. అడవులు వుంటే వర్షాలుకూడా బాగా కురుస్తాయి. అలా ఎందుకు కురుస్తాయో మీ పెద్దల నడిగి తెలుసుకో.

కొండలు చూశావా! ఎత్తుగా రాళ్ళతో, చెట్లతో చూడడానికి ఎంతో బాగుంటాయి. ఇలాంటి పెద్ద కొండల వరస ఒకటి మన విశాఖపట్టణం, రాజమండ్రి, బెజవాడ, గుంటకల్లు, కర్నూలు, బళ్ళారిమీదుగా పోతుంది. ఈ కొండలవరుసకే తూర్పుకనుమలు అంటారు. ఈ కొండలమీదనే సింహాచలం, భద్రాచలం, కనక దుర్గ, మంగళగిరి, తిరుపతి, శ్రీశైలం గుళ్ళు ఉన్నాయి. ఈ కొండల్లో బొగ్గు బంగారం, ఇనుము మొదలైనవి దొరుకు తున్నాయి. ఈ కొండలు మనకోసం ఇంకా ఏమేమి దాచి వుంచాయో త్రవ్విచూడవలసి ఉంది.





# పల్లె నుండి





మీ ఊళ్ళో కరణంగారినీ మునసబు గారినీ ఎరుగుదువా నువ్వు ? మీ ఊరి రైతులదగ్గర వాళ్ళు పన్నులు వసూలు చేస్తారు. ఊళ్లో దొంగతనాలు జరిగితే పోలీసులకు కబురుచేస్తారు. రోడ్లు చెరువులు బాగుచేయించడానికి, దీపాలు పెట్టించడానికి పంచాయితీబోర్డు పెద్ద ఉన్నాడు కాదూ! ఆయనను ప్రెసిడెంటు అంటారు. దేవుడి గుడి, స్కూలు, ఉత్తరాలు పంపే పోస్టాఫీసు ఉన్నాయి కాదూ మీ ఊళ్ళో ? మీ ఊరి కోమటి మీకు కావలసిన సరుకులు అమ్ముతాడు. కుమ్మరి కుండలు చేస్తాడు. కంసాలి నగలుచేస్తాడు. సాలీ బట్టలునేస్తాడు. గొల్ల పాలు పితుకుతాడు. మాదిగ చెప్పులు కుడతాడు, పంతులు పాఠం చెబుతాడు. కూలీలు పనిచేస్తారు.

తాలూకా:— మీ ఊళ్ళో పిల్లలు పెద్దక్లాసు చదువుకోడానికి పెద్దస్కూలు కావద్దూ మరి. వస్తువులు కొనడానికి బజారు, మరలు, సినీమాలు, కోర్టులు, పోలీసులు, ఆసుపత్రి అన్నీ పెద్ద ఊళ్ళో ఉంటాయి. మీ గ్రామంలాంటివి కొన్ని కలిసి ఒక తాలూకా. మీ తాలూకాకు ఒక పెద్దఊరు వుంటుంది. మీ తాలూకా ఏది ? రాజమండ్రియా ? ఏలూరా ? గుడివాడా ? గుంటూరా ? అనంతపురమా ? ఆల్లూరా ? నంద్యాలా ? చిత్తూరా ?

జిల్లా:— కొన్ని తాలూకాలు కలిసి ఒక జిల్లా అవుతుంది. ప్రతి జిల్లాకు ఒక జిల్లా కలెక్టరు, జిల్లా డాక్టరు, మిస్కూళ్లను నడిపే జిల్లాబోర్డు ప్రెసిడెంటు, జిల్లా విద్యాశాఖాధికారి, జడ్జి, జిల్లా పోలీసుపెద్ద వుంటారు, వీరంతా వుండేదే జిల్లా ముఖ్యపట్టణం.

మన తెలుగుదేశంలో ఇటువంటి జిల్లాలు ఇప్పుడు పదకొండు ఉన్నాయి. వాటిపేర్లు, ముఖ్యపట్టణాలు, పటంలోచూడు.

| | |
|---|---|
| 1. విశాఖపట్టణం జిల్లా | 6. నెల్లూరు జిల్లా |
| 2. తూర్పు గోదావరి ,, | 7. చిత్తూరు ,, |
| 3. పశ్చిమ గోదావరి ,, | 8. అనంతపురం ,, |
| 4. కృష్ణా ,, | 9. కర్నూలు ,, |
| 5. గుంటూరు ,, | 10. కడప ,, |

11. బళ్లారి జిల్లా

తెలుగువారు మదరాసు పట్టణంలో సగంమందికి పైగా వున్నారు. ఈ పట్టణం తెలుగువారిదే. నైజాంలో మప్పాతిక మంది తెలుగువారే. ఎప్పటికైనా అందరం ఏకంకావాలి. ఎప్పటికో మరి! దక్షిణదేశంలో తంజావూరు, కోయంబుత్తూరు, తిరునల్వేలి, మధుర మొదలైన జిల్లాలలో తెలుగువారు చాలామంది ఉన్నారు.

[మన తెలుగువారు ఇతర రాష్ట్రాలలో ఎంతమంది వున్నారో 22-వ పేజీలోని పటంలో చూడు.]






నువ్వు భోజనం చేశావా? మీ అమ్మ అన్నం పెడుతుంది. అన్నంలోకి పప్పు, నేయి, కూరలు, పచ్చళ్ళు, చారు, మజ్జిగ అన్నీ కావాలిగద! పండుగవస్తే తల అంటుకొని బూరెలు, గారెలు, బొబ్బట్లు తిని, కొత్తబట్టలు కట్టుకుంటావు. స్కూలునుంచి రాగానే "అమ్మా! ఏమన్నా పెట్టవా" అంటే పండో, మిఠాయో పెడుతుంది మీ అమ్మ. చూశావా నీకు తినడానికి ఎన్ని కావాలో! ఇవి అన్నీ ఎలావస్తాయి? బియ్యం, పప్పు, బెల్లం, పంచదార అన్నీ కావాలి. ఇవన్నీ మనదేశంలోనే పండుతాయి.

భూమి దున్ని గింజలువేసి నీళ్ళుపోస్తే మొక్కలు మొలుస్తాయి. ఎరువువేస్తే మొక్కలు బాగా పెరిగి పెద్దవై మనకు పంటనిస్తాయి. నీరు అన్నిచోట్ల దొరకదు. కొన్నిగ్రామాలకు కాలువలద్వారా నీరు వస్తుంది. కాలువలు లేనిచోట్ల బావులుత్రవ్వి పంటలు పండిస్తున్నారు. కొన్నిచోట్ల వర్షపునీరే పంటకు ఆధారం. వీటినే మెట్టపంటలు అంటారు. కొన్ని పంటలు నల్ల మట్టి భూములలోనే పండుతాయి. కొన్ని ఇసుక నేలలో మాత్రమే

పండుతాయి. కొన్ని, కూరగాయలు మొదలైనవి రెండు నెలల్లో పండుతాయి. కొన్నింటికి మూడు మొదలు అయిదు నెలలవరకు పడుతుంది. పంటలుకూడా అంతే. ధాన్యాలు, వరి, రాగి, కందులు మొదలైన పంటలు ఏ సంవత్సరానికి ఆ సంవత్సరం వెయ్యాలి. పండ్లచెట్లు ఒకమారు వేస్తే చాలాకాలం ఉంటాయి. నిమ్మ, నారింజ, మామిడి, జామ, కొబ్బరిచెట్లు ఎన్నో సంవత్సరాలు కాస్తాయి. చేలలో పండిన ప్రత్తిలోంచి దారంతీసి బట్టగానేస్తే నీకు ఒంటిగకు క్రొత్తబట్టలు వస్తున్నాయి. నీ మిఠాయిలోకి పంచదార చెరుకు గడలోంచి వస్తుంది.

తెలుగుదేశంలో ఏమేమి పండుతున్నాయో చూడు :

ధాన్యాలు:— వరి, జొన్నలు, మినుములు, కందులు, పెసలు, మొక్కజొన్నలు, శెనగలు, ఉలవలు, చోళ్లు, రాగులు.

పండ్లు:— మామిడి, నారింజ, నిమ్మ, దబ్బ, జామ, సపోటా, సీతాఫలము, బత్తాయి, సిద్ధవటం దోసకాయ, పనస, అరటి, చింతపండు, కొబ్బరి.

కూరగాయలు:— వంగ, బెండ, చిక్కుడు, కంద, బీర, ఉల్లి, కాకర, దుంపలు, ఆనపకాయ, పొట్ల, అరటికాయ, గోంగూర, మిరపకాయ, అల్లం, పసుపు.

చమురుగింజలు:— ఆవాలు, నువ్వులు, వేరుశెనగ, ఆముదాలు.

నారనిచ్చేవి:— తాటి, కొబ్బరి, ప్రత్తి, జనుము, గోగు కిత్తనార.



జంతువులు:— చలి వేస్తే శాలువకావద్దూ నీకు? దానికి ఉన్ని కావాలి. ఆ ఉన్నిని గొఱ్ఱెలు ఇస్తాయి. గొఱ్ఱెలు మీ ఊళ్ళో పొలాలకు పెంటకడతాయి. తినడానికి మాంసం ఇస్తాయి. మేకలుకూడా పాలిస్తాయి. గాంధీగారు మేకపాలే తాగుతారు. విన్నావా? నీవు ఎక్కడికైనా వెళ్ళాలి అంటే ఎద్దుబండీ మీదగాని, ఇంకా చప్పున వెళ్ళాలి అంటే గుఱ్ఱపుబండీ మీదగాని వెళతావు. వాటికి ఎడ్లు, గుఱ్ఱాలు కడతారు. ఒకచోటునుంచి ఒకచోటుకి సామానులు చేరవేయడానికి, పొలాలు దున్నడానికి, ఎడ్లు, దున్నలు ఎంతో అవసరం. మరి మజ్జిగ, నెయ్యి, ఎల్లా? ఆవులు, మేకలు, గొఱ్ఱెలు, పాలు ఇస్తున్నాయిగా!



ఒంగోలు ఆవులు పాలుబాగా ఇస్తాయి చిత్తూరు జిల్లాలో పుంగనూరు పొట్టి, పాడి ఆవులకు ప్రసిద్ధి.

ఇవిగాక నీ ఇల్లు కాచే కుక్క, ఎలుకలనుపట్టే పిల్లి, మీ ఊరిప్రక్కన అడవిలో వున్న జింకలు, కుందేళ్లు - ఈ జంతువు

లన్నింటినీ నువ్వు చూచివుంటావు. ఇవికాక రెక్కలుకలవి గ్రుడ్లు పెట్టేవి అయిన కోళ్లు, నెమిళ్లు, బాతులు, పావురాయిలు, చిలుకలు, పిచ్చుకలు — వీటి నన్నింటిని పక్షులు అంటారు. నువ్వుచూచిన పక్షులపేర్లు ఇంకాకొన్ని చెప్పు చూదాం. మీఊరి చెఱువులో ఎన్నో రకాల చేపలు ఉంటాయి వాటిపేర్లు నీకు తెలుసునా ?









# పరిశ్రమలు



చేతిపనులు:—మనకు ఇంకా బట్టలు, సబ్బులు, సిరాలు, కాగితాలు, పలకలు, రంగులు, నూనెలు, మందులు, మరలు, గ్లాసులు, బిస్కత్తులు, ఎన్నో వుంటేనేగాని పని జరుగదు. ఇవి అన్నీ మనదేశంలో తయారుచేస్తున్నారా? కొద్దిగా తయారుచేస్తున్నారు. ఇకముందునుంచి ఎక్కువగా తయారుచేయాలి. మనదేశంలో తయారైన వస్తువులనే మనం కొనాలి. విదేశవస్తువులను కొనరాదు. ఇందులో కొన్ని ఏ గ్రామంలోనో, ఏ ఇంట్లోనో తయారవుతాయి. పల్లెటూళ్ళో తయారయే వస్తువులు కొంటే మనం ఇచ్చే డబ్బు చాలావరకు పల్లెటూరివారికే ముడుతుంది. అందుకే గాంధీగారు ఇండ్లలో తయారయే వస్తువులే కొనాలి అన్నారు. వీటికి పెద్ద మరలు ఎందుకు? ఆ మరలన్నీ విదేశాలనుంచి రావాలి. వాటిమీదవచ్చే లాభం చాలామటుకు షాహుకారులే కాజేస్తారు.

మరలలో చాలామంది పనిజేస్తారు. బట్టలు మరలలోను, మగ్గాలమీద తయారుచేస్తారు. ప్రత్తి మనకు పండుతుంది. పేదవాళ్లు రాట్నాలమీద నూలు తీస్తారు. సాలీలు నేస్తారు. రంగులూ ఇక్కడే వేస్తారు. మరలు అక్కరలేకుండా ఈ పనులన్నీ చేతితో

చేయవచ్చు, ఇలా తయారయిన బట్టనే ఖద్దరు అంటారు. చాలా కాలం మన్నుతుంది. పేదవారికి ఎంతమందికో పని కలిపిస్తుంది. ఇలాగే మరలు అవసరం లేకుండా మనం తయారుచేసుకోగలవి చాలా ఉన్నాయి. వీటిని గృహపరిశ్రమలు అంటారు. ఇలాంటివి ఎక్కడచేస్తారో చెప్తాను.

ఖద్దరు:— దేశమంతట.

లక్కబొమ్మలు:— కొప్పాక.

జముఖానాలు:— ఆదవాని, అలంపురం (నైజాం.)

కంబళ్లు:— బళ్లారి, కాసుమోలు, నందికొట్కూరు, ధర్మాజిగూడెం.

తివాచీలు:— ఏలూరు, బందరు.

దంతపు పనులు:— విశాఖపట్టణం.

బొమ్మలు:— కొండపల్లి.

పేనా కలములు:— రాజమండ్రి.

పలకలు:— మార్కాపురం (కర్నూలు జిల్లా.)

చేతికర్రలు:— పూళ్ల.

సిరాలు:— తెనాలి, ఏలూరు.

పెద్దమరలు:— మీ ఊరిప్రక్కన ఉన్న బస్తీకి వెళ్లావా? అక్కడ తల నరికిన తాటిచెట్టులాగ ఉన్న పెద్ద పొగగొట్టంలోంచి పొగరావడం చూచావుకాదూ; అది పెద్ద మర.



మిల్లు

అలాంటి పెద్ద మరలు చాలా ఉన్నాయి మనదేశంలో. బెజవాడలోను, తాడేపల్లిలోను పెద్ద సిమెంటుమరలు వున్నాయి. ఉయ్యూరు, సామర్లకోట, కిర్లంపూడి, బొబ్బిలి పట్టణాలలో పంచదారమరలు ఉన్నాయి. చెరుకుగడలనుండి మనకు పంచదార వస్తుంది.




చెరుకుగడలు    యంత్రము    పంచదార బస్తాలు

మీ ఇల్లు గచ్చు చేయించుకోడానికి సిమెంటు, నీవు తినే మిఠాయిలోకి పంచదార కావాలని నీకు తెలుసుగా. ఏలూరులోను, గుంటూరులోను గోనెసంచుల మరలు ఉన్నాయి. బెజవాడ, బందరు పట్టణాలలో మందుల కార్ఖానాలు ఉన్నాయి. బెజవాడ, పాణ్యాం, కడియం అనేచోట్ల పళ్లరసములు నిలువచేసే మరలు ఉన్నాయి. ఆకివీడులో సబ్బులు తయారుచేస్తున్నారు. పింగాణి సామానులు, పెనసళ్ళు, రంగులు తయారుచేసేమరలు ఇంకా మనకులేవు. అవికూడా కావాలి.

గనులు:— భూమిమీద పండే పంటలను గురించి, భూమి పైనపెరిగే చెట్లనుగురించి చదివావు. మనకు కావలసిన వస్తువులు కొన్ని భూమిలోపలకూడా ఉన్నాయి. భూదేవి మనకోసం వాటిని దాచి ఉంచింది. నీవు వ్రాసుకునే పెనసళ్లకు, మేకులకు, రైళ్లకు, సున్నానికి, సిమెంటుకు కావలసినవి భూమిలోపలనే వున్నాయి. త్రవ్వితీస్తారు.

మీ అమ్మ, అక్క పెట్టుకునే నగల్లోను, పోగుల్లోను, ఉంగరాలలోను తళతళ మెరిసేవాటిని రాళ్లు, వజ్రాలు అంటారు. అవి మనదేశంలో ఉన్నాయి. కోహినూరు వజ్రం మన తెలుగు దేశంలో దొరికినదే. అనేక లక్షల ఖరీదుచేస్తుంది. దానిని ఇంగ్లండు



తీసుకొనిపోయి రాజుగారి కిరీటంలో పెట్టుకున్నారు. అది మన కృష్ణా జిల్లాలో బెజవాడ దగ్గర దొరికింది. అనంతపురం జిల్లాలో ఇప్పటికీ వజ్రాలు దొరుకుతాయి.

చూడు మనదేశం మనకు ఎన్ని మంచివస్తువులను ఇస్తుందో!





# నా సుఖం.



"ఈసురోమని మనుషులుంటే
దేశ మేగతి బాగుపడునోయ్?"

మనం అందరం ఏ జబ్బులేకుండా ఆరోగ్యంగా, ఆనందంగా వుండాలి. నీవు రోజు సాయంకాలం స్కూలు లోను, ఇంటికివచ్చి ఆడుకుంటావు గద! శరీరాన్ని బాగా కాపాడుకొని, చాలాకాలం బ్రతికి, సంఘానికి, దేశానికి సేవచేయాలి మరి. అందుకు నీవు ఆరోగ్యంగా వుండాలి. అంటే రోగము రొప్పి లేకుండా బలంగా ఉండాలి. అందుకోసం బలకరమైన తిండి తినాలి. వేళకు నిద్ర పోవాలి. కాకిలో కనుమూసి, కోడికూతతో లేవాలి. ఉదయాన స్నానంచేయాలి నీ శరీరం, బట్టలు, ఇల్లు శుచిగా ఉంచుకోవాలి. మన వీధులు చెత్తతో వాసనకొడుతూ ఉండకూడదు. కుళ్ళిపోయిన వస్తువులు తినకు. రోజు పాలు, పళ్లు తీసుకోగలిగితే చాలా మంచిది. రోజూ కసరతుచేసి ఆటలు ఆడితే శరీరానికి చెమటపట్టి ఆరోగ్యంగా ఉంటుంది. హాయిగా నిద్రపడుతుంది.

నీకు మంచి ఆలోచనలు చేయడానికి మంచి బుద్ధి వుండాలి. దైవప్రార్థన మరచిపోకు. ఆరోగ్యంగా ఉంటావు. ఆయుస్సు ఎక్కువ అయి చాలాకాలం బ్రతుకుతావు పూర్వం మన నాగార్జునా

# దేశవాళీ ఆటలు




బిళ్లా - కర్రా ఆట



చెడుగుడు

చార్యుడు ఏ జబ్బు లేకుండ 120 సంవత్సరములు బ్రతికాడని చదువు కున్నావు కాదూ? ఇప్పుడు గాంధీగారు చూడు — ఎంత ఆరోగ్యంగా ఉన్నారో! 21 రోజులు కటికి ఉపవాసంచేసినా బ్రతికారు. ఎందు చేత? మంచి మనస్సు, మంచి ఆహారం, మంచి కసరతు.... అన్నీ వేళకు ఉంటాయి కాబట్టి, ఇప్పటికి ఆయనకు 77 సంవత్సరాలు. దేశానికి ఎంతో సేవ చేస్తున్నారు. మన ప్రకాశంగారు చూడు. ఇంత పెద్దవయస్సులో ఎంత బలంగా ఉన్నారో! నీకుకూడా అలా వుండా లనిలేదూ? ఆటలు బాగా ఆడి ఆరోగ్యంగా ఉంటే అందంగాకూడా వుంటావు. మన భారతంలో భీముడు ఎంతో బలంకలవాడు. పెద్ద పెద్ద చెట్లనుకూడా పీకగలిగేవాడు. ఎంతటి రాక్షసులనైనా చంపేవాడు.




ఇప్పుడు మనదేశంలో పాటియాలా సంస్థానంలో 'గామా' అనే పెద్ద వస్తాదు ఉన్నాడు. ప్రపంచంలో ఉన్న వస్తాదు లందరినీ ఓడించాడు. మన తెలుగు దేశంలో "కలియుగ భీముడు" అని చెప్పబడే కోడి రామమూర్తిగారు ఉండేవాడు. ఈ మధ్యనే చనిపోయాడు. ఆయన ఎంత బలంగలవాడో తెలుసా? అబ్బో! మోటారు కారులు ఆపేవాడు. ఏనుగును ఛాతీమీద ఎక్కించుకునేవాడు. ఇనప గొలుసులు తెంపేవాడు.



కోడి రామమూర్తినాయుడు.

రాళ్ళు ఛాతీమీద పెట్టించుకుని బ్రద్దలు కొట్టించుకునేవాడు. తారాబాయి అనే బలంగల స్త్రీ ఉండేది. ఆమె కత్తులపైన పడుకునేది. జుట్టుకు పెద్ద రాళ్ళు కట్టుకుని మోసేది. చూశావా ఎంత బలంగలవారు ఉన్నారో? 'హాకీ' మొదలైన ఆటలలో కూడా ఇంగ్లాడు, జర్మనీ, అమెరికావాళ్లను ఓడించారు మనవాళ్లు.

నువ్వు బక్కగా, జబ్బుగా ఉండకూడదు. బలంగా ఆరోగ్యంగా, చురుకుగా వుండాలి. కసరతు ఎలాచెయ్యాలో నేర్చుకో. నీవు ఒంటరిగాచేసే కసరతు వుంది. తాలింఖానాలో నేర్చుకోవలసిన కసరతూ వుంది. దండాలు, బస్కీలు లాంటివి నువ్వు స్వంతంగా చేసుకోవచ్చును. కర్రత్రిప్పటం, ఆసనాలువేయడం, సూర్య నమస్కారాలు ఇతరులవద్ద నేర్చుకోవాలి. చిన్న కరేలాలు, ముద్గర్లు తిప్పటంకూడా నేర్చుకో.

ఆటలు రెండురకాలు. దేశవాలి ఆటలు, విదేశపు ఆటలు. దేశవాళీ ఆటలు పూర్వం మన తండ్రి తాతలు వారి చిన్నతనంలో ఆడుకొన్నవి. తేలిక. డబ్బు ఖర్చులేనివి. అందరు ఆడుకోవచ్చును. ఎక్కడైనా ఆడవచ్చు. పేదవారు, ధనవంతులు అందరూ

# దేశవాళీ ఆటలు




దాగుడు మూతలు




కళ్ళకు గంతల ఆట





బంతాట

ఆడవచ్చు, చెడుగుడు, దాగుడు మూతలు, ఉప్పుబత్రి, ఆకాట— నువ్వు ఎప్పుడూ ఆడలేదూ? ఇలాంటివి ఇంకా ఎన్నో ఉన్నాయి. వీటిలో కొంచెం పెద్దపిల్లలను అడుగు. వాళ్ళకు చాలా ఆటలు వచ్చు. అట్లతద్దికి, వినాయక చవితికి మీరంతా ఆడుకోలేదూ? కుస్తీలలో చూడు — ఎంత బలం గలవాడినైనా పడవేయవచ్చు.

ఆడపిల్లలు గవ్వలు, దాగుడు మూతలు, కోలాటం ఆడుకోవడం చూశావుకాదూ!

విదేశపు ఆటలు మీ తాలూకా, జిల్లా పట్టణాలలో స్కూళ్లలోను, కాలేజీలోను, క్లబ్బులలోను చూచి వుంటావు. బంతి ఆటలు- టెన్నిసు, బాడ్మింటను, కాలు బంతి వాలీబాలు, క్రికెట్టు, హాకీ- ఇవన్నీ విదేశపు ఆటలు. బంతులూ అవీ కొనడానికి వీటికి చాలా డబ్బు కావాలి. ఇవిగాక కర్రల మీద మొగ్గలు, ఉయ్యాలమీద, నిచ్చెనమీద ఆటలు వున్నాయి.



క్రికెట్టు ఆటలో ఇండియాలో కల్లా పేరుపొందినవారు కెప్టెను సి. కె. నాయుడుగారు. ఆయన మన తెలుగువారే. ఇతరఆటలలో కూడా మనవారు చాలా గొప్ప వారు ఉన్నారు. మన అప్పారావుగారు బాణాలు వేయడంలో అర్జునుడు అంతవారు.



కెప్టెన్ సి. కె. నాయుడు.

సరే, ఆటలు ఆడుతావు. ఆరోగ్యం కాపాడుకొంటావు. జబ్బు రాకుండా నే చూస్తావు. జబ్బువస్తే ఎలా అంటావా ?

ఏదైనా జబ్బువస్తే మందు వెంటనే పుచ్చుకోవాలి. మందులలోకూడా మనదేశంలో మొక్కలతోను. వస్తువులతోను తయారు చేసి మనపద్ధతి ప్రకారం ఇచ్చే మందు వున్నది. దీనిని ఆయుర్వేద వైద్యము అంటారు. దీనివల్ల అన్నిజబ్బులు నయమవుతాయి. ఇదిగాక పుండ్లు కోయడము, సూదిలోనుంచి మందు ఎక్కించడము—కాలేజీలలో నేర్పే పద్ధతి ఒకటి వున్నది. దానిని ఎలోపతి వైద్యము అంటారు. ఇది విదేశాల వైద్యం. ఇదీ పూర్వం మనదేశానిదే. ఇక్కడనుంచి పూర్వం అరేబియా వెళ్లి, అక్కడినుంచి ఇంగ్లాండుపోయి మళ్ళీ మనదేశానికి వచ్చింది. దీనిలో తరిబీదుచేయడానికి వాల్తేరులోను, మదరాసులోను కాలే

జీలు ఉన్నాయి. హోమోపతి అని ఇంకో వైద్యము వున్నది. మందులన్నీ పంచదార మాత్రలతో చేస్తారు. పిల్లలు మారాం చెయ్యకుండా తింటారు ఈ మందులు.

కాబట్టి, జబ్బుచేస్తే మీ ఊరిలో ఆసుపత్రులు వున్నాయి. జబ్బువస్తే ఆసుపత్రికివెళ్లి వెంటనే నయం చేసుకోవాలి. నీవు ఇలా ఆరోగ్యం కాపాడుకొని, ఆయుష్షు ఎక్కువచేసుకుని, మంచి బిడ్డలను కని దేశానికి ఇంకా పేరుప్రతిష్ఠలు తీసుకురావాలి.



# బ లి గు డి! బ లి గు డి!

బ లి గు డి - బ లి గు డి
బ లి గు డి - బ లి గు డి
బ లి గు డి - యా డి
బస్కీ తీసి
కాశా గట్టి
కవాతు చేసి
నరములు, కండలు
తేలేటట్లుగ
ఆ ట లు ఆ డ గ రా రం డి
పా ట లు పా డ గ రా రం డి.

—నంబూరి శ్రీనివాసరావు.



త్యా గ రా జు

# అందము-ఆనందము



చెట్టుమీద ఆకులచాటునుంచి కోకిల ''కూ కూ'' అని కూస్తూవుంటే ఎంత బాగుంటుంది! మీ పొలంలో పనిచేసేటప్పుడు చక్కగా ఊడ్పుపాటలు, కోతపాటలు పాడరూ? బిచ్చగాళ్ళు పాడుతూ మీ యింటికివస్తే నువ్వు బియ్యంవేయడం లేదూ? మీ ఊళ్ళో నాటకం వేసినప్పుడు వెళ్లి ఆ పాటలువిని ఆనందించావు. మీఅమ్మ, అక్క, నాన్న, అన్న, తమ్ములతో సినిమాకి వెళ్ళినప్పుడూ, గ్రామఫోను పెట్టినప్పుడూ చక్కని పాటలు విని ఉప్పొంగిపోతూ వుంటావు. ఈ పాటలను సంగీతం అంటారు. సంగీతం పాడితే మనస్సుకు హాయిగా వుంటుంది. సంగీతంలో తెలుగువారిది పెట్టిందిపేరు. అన్ని భాషలకంటె తెలుగు సంగీతానికి చాల అనుకూలమైన భాష. తెలుగు పాటలు తియ్యగా వుంటాయని పేరు. వేదాలు, ఉపనిషత్తులు చదవడంలో గట్టివారని కాశీలోను, కలకత్తాలోను పేరుపొందారు మన పండితులు. తప్పులు లేకుండా స్వచ్ఛంగా చదువుతారు. అమలాపురంలో ఇప్పటికీ గొప్ప పండితులు వున్నారు. తెలుగువారు వేదం చెబుతున్నా, సంగీతం పాడుతున్నా హాయిగా వుంటుంది.

అరవదేశంలోకూడా సంగీతానికి పేరుకెక్కింది తెలుగు. త్యాగరాజు, క్షేత్రయ్య తెలుగువారు. క్షేత్రయ్య కృష్ణా జిల్లావాడు.

# వాద్యములు



జలతరంగిణి



వీణ



తంబూరా



హార్మోనియం



మద్దెల

# వాద్యములు



మురళి





తబలా



బాకా



మోర్సింగ్



సన్నాయి - డోలు



సన్నాయి

అరవ పాటకులు అందరు వీరి గీతాలే పాడతారు. అరవదేశంలో సంగీతం వచ్చినవారు అందరు తెలుగుపాటలు నేర్చుకొంటారు. నీవుకూడా స్వచ్ఛంగా మాట్లాడటం, చక్కగా పాడటం నేర్చుకోవాలి. సంగీతం నోటితో పాడతారు. వీణ, ఫిడేలు, పిల్లనగ్రోవి, సన్నాయిలమీద వాయిస్తారు. పూర్వం శ్రీ కృష్ణుడు పిల్లనగ్రోవి మీద వాయిస్తే పొలాలలోని ఆవులన్నీ వచ్చినట్టు నువ్వు వినలేదూ?

పాములవాడు నాగస్వరంవాయిస్తే త్రాచుపాము పడగవిప్పి ఎలా ఆడుతుందో చూశావా? సంగీతం రాళ్లనుకూడా కరిగిస్తుందట! పటంలో మన తెలుగుదేశంలో వాయించేవాద్యాలు చూపించాను. వాటి పేరులు తెలుసుకో.



పాములవాడు

తెలుగువారిలో కొందరు ఇప్పుడుకూడా అన్ని రాష్ట్రాలలోను పేరు సంపాదించారు. రవీంద్రనాథ ఠాకూరు అనే పెద్ద కవిపేరు విన్నావుకాదూ! ఆయనబెంగాలు దేశస్థుడు. ఆయన ఒకసారి పిఠాపురం రాజాగారి దగ్గరకువచ్చి అక్కడ ఉన్న, వీణ వాయించే సంగమేశ్వర శాస్త్రిగారి పాటకు ఆశ్చర్యపడి ఆయన్ని శాంతినికేతనం తీసుకొనివెళ్లారు. ఇప్పుడు వీణలో ఈమని అచ్యుతరామ శాస్త్రిగారు గొప్పవారు. ఫిడేలులో ద్వారం వెంకటస్వామినాయుడు గారు, హరి నాగభూషణంగారు, పారేపల్లి రామకృష్ణయ్యగారు

గొప్పవారు. మద్దెల వాయించడంలో బందరులో అశ్వధాటి రామమూర్తిగారు, బెజవాడలో రాఘవయ్య చౌదరిగారు చాలా గట్టివారు ఉండేవారు. అనేక భాషలు, సంగీతం వచ్చిన ఆదిభట్ల నారాయణదాసుగారు హరికథలు అద్భుతంగా చెప్పేవారు.

రథోత్సవంలో రథం మీద ఎంత చక్కని బొమ్మలు ఉంటాయో చూడు. దేవాలయంమీద కూడా ఎన్నో చక్కని బొమ్మలు ఉంటాయి. అవి అన్నీ ఆడుతూ ఉన్నట్టు వుంటాయి. ఈ ఆటన్నే నాట్యం అంటారు. సినీమాలో చూడలేదూ నువ్వు? మనవాళ్ళు ఎంత గొప్పవారో చూడు—తాటిచెట్టుకు ఎన్నోరెట్లు ఎత్తైన గుళ్ళు, గోపురాలు కట్టారు. వాటిమీద నువ్వు నేర్చుకోడానికి ఎన్నో మంచి కథలు అందంగా చిత్రించారు. ఎంత చక్కని రంగులు! కలకలలాడుతూ నిజంగా ప్రాణం ఉన్నట్టు



ఉంటాయి. ఆ బొమ్మలు, ఆ ముఖాలూ, ఆ కళ్ళూ ఎంత బాగున్నా యో చూడు. ఏనాడు కట్టారో ఇప్పటికీ పాడయిపోలేదు. ఇటువంటి గోపురాలూ, గుళ్లూ, సింహాచలం, పాలకొల్లు, ద్వారకా, తిరుమల, మంగళగిరి, పొన్నూరు, తిరుపతి, అరుణాచలం, కంచి, మధుర, నెల్లూరు, మదరాసులో ఉన్నాయి. పెద్దవాడవు అయాక తప్పకుండా వెళ్ళి చూడు.



దేవాలయంమీద బొమ్మలు చూడు.

ఇంతేనా ? కొండలను తొలచి వేలకువేలు మనుష్యులు పట్టే గుహాలను నిర్మించారు. వాటిలో రంగు రంగుల బొమ్మలు.

ఎంత ఆశ్చర్యం! అమరావతి, నాగార్జునకొండ, మహాబలిపురం, అజంతా, ఎల్లోరా గుహలుచూడు. అజంతా గుహలలోను, లేపాక్షి దేవాలయంలోను ఎంతమంచి బొమ్మలు వ్రాశారు అనుకున్నావు?



బెజవాడదగ్గర అమరావతిలో ఉన్న రాతిస్తూపం చూడండి.
బొమ్మలు ఎలా చెక్కారో.

ఆ రంగులు ఇంకా పోలేదు. లేపాక్షి దేవాలయంలో భూమిమీద ఆనకుండా వ్రేలాడుతూ ఉండే స్తంభాలు ఉన్నాయి. హంపిలో

రాళ్ల స్తంభాలు ఉన్నాయి. వాటిని కర్రతో కొడితే సంగీతం పాడ తాయి. మహాబలిపురం కొండలలో రథాలు చెక్కారు. అతుకులు లేవు. ముక్కలులేవు. ఎంత కష్టమైనపని !

ఒక కథను బొమ్మలలో వ్రాసి చూపించవచ్చును. పాటలుగా పాడవచ్చును. నాటకంగా ఆడవచ్చును. బొమ్మలుగా వ్రాయడాన్ని చిత్రలేఖనం అంటారు. ఈ పనిలో, చనిపోయిన దామెర్ల రామా రావుగారు, ఆయన శిష్యులు వరదా వెంకటరత్నంగారు, చామ కూర సత్యనారాయణగారు, చెల్లెలు బుచ్చి కృష్ణమ్మగారు, అడవి బాపిరాజుగారు, అంకాల సుబ్బారావుగారు, వెంకటరావుగారు, మొక్కపాటి కృష్ణమూర్తిగారు, కవుతా ఆనందమోహన శాస్త్రి గారు, ముఖ్యులు.

తోలు బొమ్మలాట చూశావా? తెరవెనుక తోలుబొమ్మల నీడలు చూపి నాటకాలు ఆడిస్తారు.

పల్లెలలో వీధులలో నాటకాలు ఆడతారు. అందుకనే వాటిని వీధి నాటకాలు అంటారు. కూచిపూడి భాగవతులు ఎంతోబాగా ఆడతారు. మనదేశంలో గొప్పపేరు సంపాదించారు.

పట్టణాల్లో పెద్దహాలులోవేసే నాటకాలు ఉన్నాయి. నెల్లూరు, గుంటూరు, బెజవాడ, బందరు, ఏలూరు, రాజమండ్రి పట్టణాల్లో ప్రసిద్ధికెక్కిన నాటక కంపెనీలు ఉన్నాయి. బళ్ళారి రాఘవాచారి, స్థానం నరసింహారావు, డి. వి. సుబ్బారావు, డాక్టరు గోవిందరాజుల

సుబ్బారావు, అద్దంకి శ్రీరామమూర్తిగార్లు ఎంతో బాగా నటిస్తారు. మన తెలుగువాళ్ళు నాటకాలు ఎంతో బాగా ఆడతారు. అందుచేతనే మన సినీమాలు కూడా చాలా బాగుంటాయి. తెలుగులో ఎన్నో ఫిలిములు వస్తున్నాయి. సినీమాల్లో కన్నాంబ, కాంచనమాల, భానుమతి, సూర్యకుమారి, నాగయ్య, గగ్గయ్య, రాఘవాచారి, వై. వి. రావు, అద్దంకి ఎంత బాగా ఆడతారో, పాడతారో నటిస్తారో నువ్వు చాలాసార్లు చూచి ఉంటావు.


బళ్లారి రాఘవాచారి పిచ్చివాడి వేషంలో

ఇంకా పగలే వేషాలు వేసుకొని ఇండ్లకువచ్చి ఆడేవారు ఉన్నారు. వీరిని పగటివేషగాళ్ళు అంటాము. చూశావా మన తెలుగుదేశంలో ఎంతమంది నటులు, పాటకులు, చిత్రలేఖకులు ఉన్నారో!



గదా! గొప్పదేశము అన్నారు. గొప్పవాళ్లు పుట్టారు. ఇలాఎందుకు ఉండాలి — అని అడుగుతావు. మంచిమాట అడిగావు. మనదేశ పరిపాలన మనదేశంలో లేదంటినిగా! ఆ పైదేశాలలో ప్రతిపిల్ల వాడు తప్పక బడికిపోవాలని ఆ దేశాల ప్రభుత్వాలు బలవంతపెట్టి చదివిస్తాయి. డబ్బు అక్కరలేదు. పుస్తకాలుకూడా నాలుగో క్లాసు వరకు ఊరికే ఇస్తారు. చూశావా ఎంత బాగుందో! అందుకే ఆదేశాల్లో అందరు చదువుకొన్నవాళ్లు ఉన్నారు. మనదేశంలోకూడా ఇలా ఊరికే బలవంతంగా చదువు చెప్పించే ఏర్పాటులు చేయమని మనలో గొప్పవాడు గోఖలేగారు ప్రభుత్వాన్ని అడిగితే వాళ్లు ఒప్పుకోలేదు. ఇప్పుడు మనదేశాన్ని పాలించే బ్రిటిషువారి దేశంలో కొంచెం ఇంచుమించు అందరు చదువుకొన్నవారే. వారు మన దేశాన్ని పాలించటం మొదలుపెట్టి 150 సంవత్సరాలపైన అయింది. మరి మనదేశంలో చదువు ఇలా ఉందేం? ఎప్పుడూ ఇలా ఉండవలసిందేనా? ఉండదు. కాలం మారుతూందిగా! మనం మన ఇష్టంవచ్చినట్టు దేశానికి కావలసిన పనులన్నీ చేసుకునే కాలం రాదూమరి! చప్పునే వస్తుందిలే.

పూర్వకాలం — అనగా బ్రిటిషువారు మనదేశానికి రాక ముందు వందల సంవత్సరాల క్రిందట మన తెలుగుదేశంలో చదువుకునే పిల్లలకు ఊరికే విద్యచెప్పేవారు. పిల్లలువెళ్లి గురువు గారిదగ్గర కొన్ని సంవత్సరాలు ఉండి అక్కడే భోజనం, బస, కసరతు, ఈత అన్నీ నేర్చుకుని చదువు పూర్తి అయిన తరువాత ఇంటికివచ్చి పెళ్లిచేసుకొనేవారు. మన దేవుడిగుళ్లు ఉన్నాయిగదా! వాటిలో మంచి పండితులు ఉండేవారు. ఇంకా చదువు చెప్పడాని

కని పండితులకు రాజులు భూములు ఇచ్చేవారు. ఈ పండితులు ఉన్న ఊళ్ళే అగ్రహారాలు. అక్కడ అందరికీ ఊరికే చదువు చెప్పేవారు. అంతేకాదు, ఎన్నిదేశాలనుంచో విద్యార్థులు గుంటూరు, కృష్ణాజిల్లాలో ఉన్న అమరావతి, ధరణికోట విద్యాలయాలకు వచ్చి మతవిషయాలు, శాస్త్రాలు చదువుకునేవారు. ఇప్పుడు మన మదరాసు, ఆంధ్ర విశ్వవిద్యాలయాలలోవలె వేలకువేలు విద్యార్థులు ఒకేచోట చదువుకునేవారు. కాంచీపురంలో ఒక విద్యాపీఠం ఉండేది.



సన్యాసి

సన్యాసులను చూశావుకాదూ! సన్యాసులు అంటే అన్నీ వదలివెట్టినవారు. వీరు ఉండే చోట్లను మఠాలు అంటారు. అక్కడకూడా పండితులు చదువుచెప్పేవారు. ఇలాగే మొన్నటి వరకు విశాఖపట్టణంలోను, విజయనగరంలోను, అమలాపురంలోను, కాకర్లమూడి (పశ్చిమ గోదావరిజిల్లా) లోను, ఆకిరపల్లి (కృష్ణాజిల్లా) లోను, తిరుపతిలోను విద్యచెప్పేవారు. ఇంగ్లీషువారు మనదేశానికి రాకపూర్వం మన బడులన్నీ ఇలాంటివే.

ఇప్పుడు నువ్వు మీఊరి బడిలో చదువుకోవాలి. ఈ ఇంగ్లీషుబడులు రాకముందు పెద్దబాలశిక్ష, బాలరామాయణం, శతకాల్లో పద్యాలు, లెక్కలు, మంచి వస్తూరి వీధిబడిలో అరుగుల మీద చెప్పేవారు.

ఇప్పుడు మీరు ఎలిమెంటరీ స్కూలుకు వెళ్లాలి. అక్కడ 5 వ క్లాసు పూర్తి అయిన తరువాత ఇంగ్లీషు చదవాలని ఉంటే



కట్టమంచి రామలింగారెడ్డి

మీ ఊళ్ళో ఉన్న పెద్ద బడిలోకో లేక దగ్గిర బస్తీకో వెళ్లి చదువు కోవాలి. ఆ బడులను మాధ్యమిక పాఠశాల (మిడిల్ స్కూలు), ఉన్నతపాఠశాల (హైస్కూలు) అంటారు, అక్కడ కొన్నాళ్లు చదివి స్కూలు ఫైనలు పరీక్ష పాసు అవుతావు. తరువాత ఇంటరు, బి. యే. చదవడానికి కళాశాల (కాలేజీకి) వెళతావు, అక్కడ పరీక్షలు వ్రాసై డాక్టరువు కావాలని ఉంటే మెడికలు కాలేజీకి, మాస్టరుపని చెయ్యాలని ఉంటే ట్రైనింగు కాలేజీకి,

ప్లీడరువు కావాలని ఉంటే లా కాలేజీకి వెళతావు.

ఇలా తెలుగుదేశంలో హైస్కూళ్లు,కాలేజీలు మొగవాళ్లకు, ఆడవాళ్లకు అన్ని జిల్లాలలోను ఉన్నాయి. ఈ కాలేజీలలోను హైస్కూళ్లలోను -ఏమేమి నేర్పాలో నిర్ణయించి పరీక్షలు నడిపే దానిని విశ్వవిద్యాలయం అంటారు. దీని పెద్దను వైసుఛాన్సలరు లేక ఉపాధ్యక్షుడు అంటారు. మనకు ఇలాంటి విశ్వవిద్యాలయం ఒకటి ఉన్నది. ప్రస్తుతం దానికి పెద్ద కట్టమంచి రామలింగా రెడ్డిగారు. మహా పండితుడు. వీరికి పూర్వం రాధాకృష్ణయ్యగారు ఉండేవారు. రాధాకృష్ణయ్యగారు చాలా గొప్ప పండితులు. విదేశాలలో కూడ పెద్దపేరు పొందారు. ఇప్పుడు మాళవ్యాగారు స్థాపించిన కాశీ విశ్వవిద్యాలయం నడుపుతున్నారు.


సర్వేపల్లి రాధాకృష్ణయ్య

కాలేజీ పెద్దను ప్రిన్సిపాలు అంటారు. మన దేశంలోను, ఇతరదేశాలలోను పెద్దపరీక్షలు పాసు అయిన పండితులు, డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు ఎంతమందో ఉన్నారు మన తెలుగువారిలో. ఆడవాళ్లలోకూడా చాలామంది వున్నారు. వీరంతా ఇప్పుడు గొప్ప గొప్ప ఉద్యోగాలు చేస్తున్నారు.

"ఈ ఇంగ్లీషు చదువు కేవలం గుమాస్తాలకోసం పెట్టారు, అందువల్ల ఈ చదువు మనదేశానికి ఉపయోగంలేదు" అంటు న్నారు మన పెద్దలలో కొందరు. చదువుకొన్నవాళ్ళు చాలామంది ఉండటంవల్ల ఇప్పుడు ఉద్యోగాలు దొరకటంలేదు. ఇంకెందుకూ ఈ చదువు పనికిరాదు. భుక్తిలేదు. ముక్తిలేదు.

## తెలుగు తేట

ఇక మన తెలుగుభాషసంగతి తెలుసుకుందాం. 'తెలుగు తేట' అన్నారు విన్నావా ? అంటే చక్కని భాష, అని. మన మదరాసు రాజధానిలో అరవం, తెలుగు, కన్నడం, మళయాళం భాషలు మాట్లాడేవారు ఉన్నారని విన్నావుకాదూ !



ఈ నాలుగుభాషలు పూర్వం ఒకటేభాషగా ఉండేవి అనీ, క్రమంగా మారిపోయినాయి అనీ, ఆ మొదటిభాషపేరు 'ద్రావిడ భాష' అనీ పండితులు చెపుతారు. అందుకనే ఇప్పటికీ కొన్ని మాటలు ఈ నాలుగు భాషలలోను ఒకటేమాదిరిగా ఉన్నాయి. హిందూదేశం మొత్తంమీద మన తెలుగుమాట్లాడేవారు నూటికి పదిమంది ఉన్నారు. మన తరువాతనే అరవం, మహారాష్ట్రం, కన్నడం భాషలు మాట్లాడేవారు

## భారతం - భాగవతం

పూర్వంనుంచి తెలుగువారిలో గొప్ప సంస్కృత పండితులు ఉన్నారు. శంకరాచార్యులవారికి కొంచెం ముందుగా ఉన్న మహా పండితుడు కుమారిలభట్టు ఆంధ్రుడు. భవభూతి, శ్రీనాథుడు, వేదాలకు వ్యాఖ్యానం వ్రాసిన విద్యారణ్యులు తెలుగువారేగదా! మన తెలుగులో భారతం, భాగవతం, మనుచరిత్ర, అముక్త మాల్యద గొప్ప గ్రంథాలు. ఇంకా ఎన్నో ఉన్నాయి. తెలుగు భారతంవంటిది ఏభాషలోను లేదంటారు. సంస్కృతంలో వేద వ్యాసుడు అనే ఋషి భారతం, భాగవతం వ్రాశాడు. ఆ భారతాన్ని తెలుగులో నన్నయ, తిక్కన, ఎఱ్ఱాప్రగడ అనే ముగ్గురు కవులు చక్కగా వ్రాశారు. వీరిని కవిత్రయం అంటారు. కవులు అంటే పద్యాలుకూడా వ్రాసేవారు అని బమ్మెర పోతనగారు భాగవతాన్ని తెలుగులో వ్రాశారు. ఈ గ్రంథాలు ఎంతో బాగుంటాయి. నీవు

పెద్దవాడవు అయినతరువాత తప్పక చదవాలిసుమా! అప్పుడు ఆనందిస్తావు. నేను చెప్పింది నిజమేనంటావు. మనుచరిత్ర అల్లసాని పెద్దన్న వ్రాశాడు. ఈయనను కృష్ణదేవరాయలు పల్లకీమీద ఊరేగించి 'ఆంధ్ర కవితా పితామహుడు' అని బిరుదు ఇచ్చాడు. అనగా తెలుగు కవులకు తాత అని. వీరశైవ మతాన్ని గురించి సామాన్య జనానికి చెప్పడానికి తేలిక పద్యాలలో వ్రాసిన పాల్కురికి సోమనాథ కవిగూడా చాలా గొప్పవాడు. వీరందరు సంస్కృతంలోకూడా గొప్ప పండితులు.

కాశీలో గొప్ప సంస్కృత పండితులు మన తెలుగువాళ్లు ఉండేవారు. మొన్నటిదాక విజయనగరంలో తాతా సుబ్బరాయశాస్త్రి గారు అనే గొప్ప పండితులు ఉండేవారు. గోదావరి జిల్లాలో అమలాపురం సంస్కృత పండితులకు ప్రసిద్ధి. అన్ని జాతుల వారికి సంస్కృతం నేర్పే కళాశాలలు తెనాలి, గూడూరు, కొవ్వూరు, రాజమండ్రి, విజయనగరం, తిరుపతి పట్టణాల్లో ఉన్నాయి.



మహామహోపాధ్యాయ
తాతా సుబ్బరాయశాస్త్రి

శతావధాని చెళ్ళపిళ్ల వెంకట శాస్త్రిగారు ఇప్పటి కవులలో పేరుపొందినవారు. పూర్వకవులలో వేమన అనే రెడ్డి తెలుగులో చక్కని పద్యాలు అందరకు అర్థమయ్యేట్టు వ్రాశాడు. మీ బడిలో నువ్వు ఆయన పద్యాలు చదవలేదూ ?



గురుజాడ అప్పారావు

పుస్తకాలు అందరికి అర్థమయే భాషలో వ్రాసేటట్టు చేయడానికి గురజాడ అప్పారావు గారు, గిడుగు రామమూర్తి పంతులుగారు చాలా పాటు పడ్డారు. వేదం వెంకటరాయ శాస్త్రిగారు, బళ్లారి కృష్ణమాచార్యులు గారు మంచి నాటకాలు వ్రాసిన పండితులు. మన తెలుగు వారిని నిద్రనుండి మేలుకొలిపి భాషకు, దేశానికి, స్త్రీలకు ఎంతో సేవచేసిన కందుకూరి వీరేశలింగం పంతులుగారిని మరువగూడదు. ఆయన ఆంధ్రుల దురాచారాలను మానిపించారు. స్త్రీలకు విద్యకావాలని పోరాడారు. కొత్తకొత్త మార్గాలలో నవలలు, ప్రహసనాలు, కథలు, జీవితాలు వ్రాశారు. ఆయనవల్ల అనేకమంది స్త్రీలు, బీదవారు వృద్ధిలోకి వచ్చారు. మొదటిరోజుల్లో తెలుగులో ఒక పత్రికకూడా పెట్టారు.

తెలుగులో నవలలు వ్రాసినవారు ఇంకొకరు ఉన్నారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు. పాప మాయనకు కళ్లలేవు. పిల్లలకు కావలసిన కథలు, గీతాలు చింతా దీక్షితులుగారు, వెంకట పార్వతీశ్వర కవులు వ్రాశారు. నీవు ఎప్పుడైనా చదివావా? ఇంకా చాలా మంది ఉన్నారు. వారిని గురించి పెద్దవాడవు అయిన తరవాత నేర్చుకొందువుగాని.



చిలకమర్తి లక్ష్మీనరసింహం

గ్రంథాలయాలు:—తెలుగులో ఎన్నో గొప్ప పుస్తకాలు ఉన్నాయి. అవి అన్నీ అందరూ చదవవలసినవే. కాని అందరు కొనగలరా? అందుకని చందాలు పోగుచేసి వందలుకొద్దీ మంచి పుస్తకాలు కొని, అందరూ చదువుకొనడానికి వీలుగా ఒకచోట ఉంచుతారు. దాన్ని గ్రంథాలయం అంటారు. అక్కడికి రోజూ ఎక్కడెక్కడ ఏమి జరుగుతూందో అన్నీ అచ్చువేసి వచ్చే పత్రికలుకూడా వస్తాయి. మీఊళ్ళోలేదూ అలాంటి గ్రంథాలయం? తెలుగుదేశంలో ఎన్నో ఊళ్లలో ఉన్నాయి. అన్ని ఊళ్లలోను గ్రంథాలయాలు పెట్టించడానికి అయ్యంకి వెంకటరమణయ్యగారు

ఎంతో పాటుపడ్డారు. గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు, పాతూరి నాగభూషణంగారు ఇప్పుడు పాటుపడుతున్నారు.

పత్రికలు:— మీఊళ్లో మీటింగులు జరిగినా, గొప్పవారు ఎవరైనా మీఊరు వచ్చినా, వర్షాలు ఎక్కువ అయినా, ధరలు పెరిగినా అన్నీ నువ్వు వ్రాసిపంపితే పత్రికలలో అచ్చువేసి మీఊరి గ్రంథాలయానికీ, ఇంకా డబ్బుకట్టినవారికీ పంపిస్తారు. పత్రిక రోజూ చదువుతూవుంటే ప్రపంచ విషయాలన్నీ తెలుస్తాయి. దేశ దేశాల వార్తలను మనకు తెలియపరుస్తాయి గనుక వీటిని వార్తా పత్రికలు అనికూడా అంటారు. పత్రికనునడిపే ఆయనను సంపాదకుడు అంటారు. రోజూ వచ్చే పత్రికలు దినపత్రికలు. వారానికొకసారి వచ్చేవి వారపత్రికలు. నెలకు వచ్చేవి మాసపత్రికలు. పత్రికలు అన్నిదేశాలలోనూ ఉన్నాయి. మనదేశంలోనే తక్కువ. పెద్దవాడివి కాగానే రోజూ పత్రిక చదవాలి. లేకపోతే ఎక్కడ ఏమి జరుగుతున్నది నీకు ఎలా తెలుస్తుంది ?

మీ ఊరి గ్రంథాలయంలోనో, మీయింట్లోనో, స్కూలులోనో పత్రికలు చూసేఉంటావు రైలుస్టేషన్లలో "పత్రిక, పత్రిక" అని అరుస్తారు. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక అని కేకలేయడం విన్నావుగా ! మీకోసం ప్రత్యేకంగా ఒక పత్రిక వుంది—"బాల". అందులో కథలు, నాటికలు, బొమ్మలు, విజ్ఞాన విషయాలూ అన్నీ వుంటాయి. నువ్వు ప్రతి నెలా "బాల" పత్రికను చదువుతున్నావా ?

# మన పత్రికలు



1942-వ సం॥ ఆగస్టు 8-వ తేదీనాటికి ఉన్న కొన్ని తెలుగు పత్రికలు.





దేవాలయం.

మీ ఊరిలో దేవాలయం ఉందిగా! పండుగరోజున అందరు దేవుణ్ణి మొక్కుతారు. ఇంట్లో పూజచేస్తారు. ఇలా దేవాలయంలోకి వెళ్లేవారు అందరు హిందువులు వారిమతం హిందూమతం. మీ పెద్దలు కొంతమంది నామాలు పెడతారు. మరికొందరు వీభూతి పెట్టుకొంటారు. నీ పేరు లాగానే వారికికూడా వెంకయ్య, హరిశ్చంద్రుడు, గాంధి, ప్రకాశం, రంగనాయకులు, గోపాలరావు, సీతమ్మ, అన్నపూర్ణ, రామమ్మ — ఇలాంటిపేరు ఉంటాయి.

మీ ఊళ్ళో సాయిబులు ఉన్నారా? వారికి గడ్డాలు ఉంటాయి. టోపీలుకూడా పెట్టుకుంటారు. లేకపోతే తలగుడ్డలు చుట్టుకుంటారు. వాళ్ల పండుగరోజుల్లో వాళ్లు మసీదులోకి వెళతారు అందులో విగ్రహాలు వుండవు. వారిపేర్లు మజీదుఖాను, అజాదు, అసఫాలీ, ఇబ్రాహీము -


మసీదు.


చర్చి

ఇలా ఉంటాయి. వారిది మహమ్మదీయ మతం.

ఇలాగే క్రైస్తవులు ఉన్నారు వారికి మనలాగ బొట్లు వుండవు. ప్రతి ఆదివారం చర్చికి వెళతారు, ఏసు క్రీస్తును నమ్ముతారు. వారి మత గ్రంథం బైబిలు. మనకు వేదం ఎలాగో వారికి ఆ గ్రంథం అలాంటిది.

ఇంకా బౌద్ధమతము అనీ, జైనమతము అనీ, పార్శీ మతము అనీ, సిక్కుమతము అనీ ఉన్నాయి. మతము అనగా ఒకేరకమైన ఆచారాలు, కట్టుబొట్లు కలిగిఉండి, ఒకే దేవుణ్ణి మొక్కే కొందరు మనుష్యుల సంఘం. బుద్ధుని గురించి మీ పాఠాల్లో చదివావుగా! ఆయన అందరినీ సమానంగా చూడమనే వాడు. కులాలు - అంటే బ్రాహ్మణులు, కోమట్లు, రాజులు, నాయుళ్లు, కమ్మలు, రెడ్లు, పంచములు - ఇలా తేడాలు ఉండ


గౌతమ బుద్ధుడు

# మ త గు రు వు లు



శం క రా చా ర్యు లు



రా మా ను జా చా ర్యు లు



మ ధ్వా చా ర్యు లు



వ ల్ల భా చా ర్యు లు

మానవులందరూ దేముని బిడ్డలే—ఏను
మానవుని వెలిపెట్టినచో భగవంతుని వెలిపెట్టినట్లే—గాంధి.

కూడదనీ, జతువులను చంపకూడదనీ, అందరినీ దయతో చూడాలి అనీ ఆయన బోధించాడు. ఆయనమతం మనదేశంలోనే కాదు, చైనా, జపాను, టిబెట్టు, బర్మా ఎన్నిదేశాలకో వెళ్ళింది. ఆకాలంలో మన హిందూదేశము అంతా అన్నివిషయాలలోను గొప్పదిగా ఉండేది. మన తెలుగుదేశంలోకూడా గుంటూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో ఈమతం బాగా వ్యాపించి ఉండేది. అమరావతి, ఘంటశాల, గుడివాడ, నాగార్జునకొండ, భట్టిప్రోలు పట్టణాల్లో ఈ మతంవారు ఉండేవారు. అమరావతిలోను, నాగార్జునకొండలోను పెద్ద విద్యాలయాలు వుండేవని ఇదివరకే విన్నావు కాదూ!

హిందూమతంతో మళ్ళీ చిన్నచిన్న మతాలు వున్నాయి. వాటిలో శైవమతం ఒకటి. జంగాలు, వడ్రంగులు శైవులే. బసవేశ్వరుడు వీరి గురువు. బళ్లారి, అనంతపురం, కర్నూలు, గుంటూరు జిల్లాలలో ఈ మతం ఎక్కువ.

ఇవిగాక బ్రహ్మ సమాజం అనీ. ఆర్య సమాజం అనీ వున్నాయి. వీరు జాతివిభేదాలు ఒప్పుకోరు. దేవుడు ఒకడే అంటారు. సాయిబాబా, రాధాస్వామి లాంటివారు బోధించిన కొత్త మతాలు కొన్ని వున్నాయి. ఇవికూడా హిందూ మతంలో భాగాలే సుమా!

మనలో శంకరుడు, రామానుజుడు, మధ్వుడు, నింబార్కుడు, వల్లభుడు మొదలైన మత గురువులు పుట్టారు.

నువ్వు కొన్ని పండుగలకు కొత్తబట్టలు కట్టుకుంటావు. కొన్ని పండుగలకు టపాకాయలు కాలుస్తావు. వాటిని జ్ఞాపకం

తెచ్చుకో. మనకు ముఖ్యమైన పండుగలు—సంవత్సరాది, దసరా, సంకురాత్రి, దీపావళి. శ్రీరామనవమి, వినాయకచవితి, ఇలాగే క్రైస్తవులకు క్రిస్మసు పండుగ, మహమ్మదీయులకు రంజాను పండుగ ఉన్నాయి.

సంవత్సరాది పొద్దున్నే లేచి తలంటుకుని, వేపపూవు పచ్చడి తిని, కొత్తబట్టలు కట్టుకుంటావు. అది మనకు ముఖ్యమైన పండగ. దసరా పండగ శరత్కాలంలో వస్తుంది. దానిని విజయదశమి అనికూడా అంటారు. శ్రీరామనవమి రాములవారి పెళ్ళి ఉత్సవం. వినాయకచవితి అంటే ఉండ్రాళ్ళ పండగ. ఆరోజున మనమందరం కష్టాలు పోగొట్టమని వినాయకుణ్ణి వేడుకుంటాం. భోగిమంటలు వేస్తారే అది సంక్రాంతి పండగ. దీపావళి అంటే నరకాసురుణ్ణి చంపిన రోజు సువ్వుటపాకాయలు కాల్చుకునేది ఆరోజునేగా !

మనదేశంలో అనేక పుణ్యస్థలాలు, గుళ్లు, గోపురాలు, ఆశ్రమాలు ఉన్నాయి. మీ బడిపిల్లలందరు కలిసిగాని, పెద్దవాళ్లు అయిన తరువాతగాని తప్పకుండా వెళ్లి చూడండి. ముఖ్యంగా సింహాచలం, తిరుపతి, మంగళగిరి, పొన్నూరు, కనకదుర్గ (బెజవాడ,) నెల్లూరు, మదరాసు, అన్నవరం, శ్రీశైలం, ద్రాక్షారామం, కాళహస్తి - వెళ్లి చూడదగినవి.



# నాగస్వాజి



ఇంతవరకు తెలుగు భాషనుగురించి తెలుగుదేశాన్ని గురించి తెలుసుకున్నావు. మనదేశం అంటే ఏమిటో, ఇక్కడ ఏఏ పంటలు పండుతాయో. మన పశువులు మనకు ఎంత ఉపకారం చేస్తున్నాయో చెప్పానుగదా ! మనదేశంలో నదులు, కొండలు, ఎక్కడెక్కడ ఉన్నాయో, మన పొలాలకు నీరు ఎట్లావస్తూందో తెలుసుకున్నావు. మన తెలుగుదేశంలో పండితులు ఎవరున్నారో, నాటకాలు ఎవరు బాగా ఆడతారో, పాటలు ఎవరు బాగా పాడతారో, పండుగలు ఏమిటో, ఇంకా ఎన్నో తెలుసుకున్నావు.

ఇప్పుడు మన తెలుగుదేశంకోసం పాటుపడినవారు, పెద్ద ఉద్యోగాలు చేసేవారు, రాజులు, జమీందారులు మనకు ఏమి చేస్తున్నారో - ఈ విషయాలన్నీ తెలుసుకోవద్దూ ?

కందుకూరు వీరేశలింగంగారిని గురించి నీకు కొంచెం ఇదివరకే చెప్పాను. ఈయన ఇప్పుడు లేడుగాని ఎన్నో విషయాలలో మన తెలుగుదేశానికి ఎంతో మేలుచేశాడు. ఇండియాను రాజా రామమోహనరాయి ఎలా మేలుకొలిపాడో అలా ఈయన నిద్రలో ఉండిన మనల్ని మేలుకొలిపాడు. మనవాళ్లకు ఎన్నో

మంచివిషయాలు చెప్పాడు. అందరు చదువుకునే పత్రికలు ఆయన రోజులలో అంతగా లేవు. నువ్వు ఎక్కువ, నేను తక్కువ, నా కులం పెద్దది, నువ్వు అంటరానివాడవు అనే భేదాలు ఆయన రోజులలో ఇంకా ఎక్కువగా వుండేవి. చిన్నపిల్లలకి, నీకంటె కూడా చిన్నపిల్లలకి పెళ్లిళ్లు చేసేవారు ! మొగవాళ్లు భార్యచనిపోతే మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చుగాని, మొగుడు చనిపోతే ఆడవాళ్ళు చేసుకోకూడదు. పాపం ఆడపిల్లలకు 5, 6, ఏళ్ల పిల్లలకు వాళ్ల ఇష్టంలేకుండానే పెళ్లిళ్ళుచేసి మొగుడు చచ్చిపోతే మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా అలాగే వుండిపోవాలి అనేవారు. అలా అవసరం లేదు. మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు, తప్పులేదని బాగా భయంలేకుండా చెప్పి అలాంటి దిక్కులేని పిల్లలకు ఎందరికో పెళ్లిళ్ళుచేశాడు. రాజమండ్రిలో మంచి హైస్కూలు పెట్టాడు. ఆడపిల్లలు, మాల పిల్లలుకూడా ఆ స్కూలులో చదువుకోవచ్చు. నువ్వు ఈసారి రాజమండ్రి వెళితే ఆయన బొమ్మ, రాతితోచేసింది ఇన్నీసుపేటలో ఉంది - తప్పకచూడు. ఈయన ఎంతో మేలుచేసిన తాతగారు. నమస్కారం తాతా ! నువ్వు మాకు ఎంతో మేలుచేశావు - అని దణ్ణంపెట్టిరా. ఇలా దేశాన్ని, మనుష్యుల్ని, భాషను బాగుచేసిన వారిని వీరులు అంటారు. వీరులకు చేసే పూజను వీరపూజ అంటారు. తెలుగువారు ఇదిబాగా నేర్చుకోవాలి.

కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారి పేరు వినివుంటావు. ఆంధ్రపత్రిక అనే దినపత్రిక ఈయన పెట్టినదే. ఈ పత్రికవల్ల ఇంగ్లీషురాని తెలుగువారు ఎందరో ఎన్నోవిషయాలు తెలుసుకుంటున్నారు. "అమ్మో తలనొప్పి" అంటే "ఉండునాయనా ! అమృ

తాంజనం రాస్తాను" అని మీ అమ్మ నీ తలకు మందు రాయలేదూ? ఈమందు ఈయన చేసినదే. ఈమందు అమ్మి ఎన్నో లక్షలు రూపాయిలు సంపాదించి పేదవారి చదువుకు పుస్తకాలను, జబ్బులకు మందులను దానంచేసేవారు. గాంధీగారి శిష్యులు. ఎన్నో సారులు జైలుకు వెళ్లారు. గాంధీగారు వీరికి విశ్వదాత అనేబిరుదు ఇచ్చారు, ఎందుకంటే ఎక్కడచూచినా ఈయన దానాలే. దేశాన్ని ప్రేమించేవాడు. పండితుడు. తెలుగుదేశం ఆంధ్రరాష్ట్రం అనే పేరుతో ప్రత్యేకంగా ఉండాలి అని పోట్లాడేవాడు.

ముట్నూరి కృష్ణారావుగారు గొప్ప పండితులు. సుమారు 44 ఏళ్లనుంచి బందరులో కృష్ణా పత్రిక అనే గొప్ప పత్రిక పెట్టి దేశానికి ఎంతో వెలుగునిస్తూ ఉండేవారు. మొన్న మొన్ననే చనిపోయారు.

మన తెలుగ్వారు కొందరు గొప్ప గొప్ప ఉద్యోగాలు చేశారు. మైసూరు, తిరువాన్కూరు సంస్థానాల్లో దివాన్లుగా పని చేశారు. పానగల్లు రాజా, త్యాగరాజు చెట్టి అనేవారు. "అరవవారు మనకంటె గొప్ప ఉద్యోగాలు చేస్తున్నారు; మన తెలుగువారుకూడా చదువులోను, ఉద్యోగాలలోనుకూడా వారితో సరిసమానంగా ఉండాలి" అన్నారు. అంతేకాదు. తెలుగువారిలోకూడా అన్ని జాతులవారు అన్ని ఉద్యోగాలలోను ఉండాలని గవర్నమెంటుతో పోట్లాడారు. పానగల్లురాజాగారు పండితులు. మదరాసు ప్రభుత్వానికి ప్రధానమంత్రిగా ఉండేవారు. ఆంధ్ర మహాసభకు ప్రెసిడెంటు. ఆయుర్వేదం మంచిదనీ అది నేర్పే స్కూలు పెట్టించారు. ఆంధ్ర

విశ్వ విద్యాలయమును స్థాపించారు. వేరే మనకు ఒక మెడికలు కాలేజీ వారికాలంలోనే స్థాపించారు.

మనకు గవర్నరులు ఎప్పుడు తెల్లవారే. కాని కొంతకాలం తెలుగువారు ఇద్దరు గవర్నర్లుగా ఉన్నారు ఒకరు కూర్మా వెంకట రెడ్డి నాయుడుగారు. వీరు కొంతకాలం మంత్రిగా పనిచేశారు. అన్నామలై విశ్వవిద్యాలయానికి వైసు ఛాన్సలరుగాకూడా పని చేశారు. దక్షిణాఫ్రికాలో మనదేశంలో ఏజంటుగా పనిచేశారు. గవర్నర్లుగా పనిచేసినవారిలో రెండవవారు ఈడ్పుగంటి రాఘవేంద్ర రావుగారు. వీరిది అసలు కృష్ణాజిల్లా పెదమద్దాలిగ్రామం. కాని వీరి తాతలు మిలిటరీతో నాగపూరు, బిలాసపూరు వెళ్ళి అక్కడ ఉండిపోయారు. ఈయన బారిస్టరు పాసయి కాంగ్రెసులో చేరారు. గొప్ప దేశభక్తుడు. నాగపూరులో మంత్రి అయి తరువాత గవర్నరు అయాడు. అయినప్పటికి ఖద్దరు బట్టలు, ఖద్దరుటోపి మాన లేదు. అందుచే ఆయనను గాంధీటోపీ గవర్నరు అన్నారు. ఇంగ్లాండులోను, ఇండియాలోను పెద్ద ఉద్యోగాలుచేసి చనిపోయారు.

నాగపూరులో తెలుగువారు, భవానీశంకర నియోగిగారు హైకోర్టు జడ్జీగా ఉన్నారు.

మనకు తగాదాలువస్తే తీర్చే పెద్దకోర్టు ఉన్నది. దానిని హైకోర్టు అంటారు. అందులో జడ్జీలు ఉంటారు. ముత్తా వెంకట సుబ్బారావు, వేపా రామేశం, పోకల వెంకటరమణరావు నాయుడు, బి. సోమయ్యగార్లు హైకోర్టు జడ్జీలుగా పనిచేశారు. రాజమన్నారు గారు, గోవిందరాజాచారిగారు ఇప్పుడు హైకోర్టు జడ్జీలుగా పనిచేస్తున్నారు.

# తెలుగు గవర్నర్లు



కూర్మా వెంకటరెడ్డి
నాయుడు

మదరాసు గవర్నరుగా పనిచేశారు.

## గాంధీటోపీ గవర్నరు

డా॥ ఈడ్పుగంటి రాఘవేంద్రరా

మధ్యరాష్ట్రము (సి. పి.) గవర్నరు
పని చేశారు.



# తెలుగు జడ్జీలు





ంకెపసుబ్బారావు



మాచిరాజు భవానీ శంకరనియోగి. (సి. పి.)



జొకల వెంకటరమణరావు

టంగుటూరి ప్రకాశం పంతులుగారి పేరు విన్నావా? మన గొప్పవాళ్ళలో ఈయన ఒకరు. ఇంగ్లాండువెళ్లి బారిస్టరు పరీక్ష పాసయివచ్చి మదరాసులో నెలకు వేలకు వేలు సంపాదించేవారు. నాగేశ్వరరావుగారి లాగానే గాంధీగారి కాంగ్రెసులో చేరారు, సంపాదన పోయింది. లక్షల ఆస్తిపోయింది. దేశంకోసం ఎన్నో సార్లు జైలుకు వెళ్లారు. ముసలివారు అయినప్పటికి చాలా ధైర్యం కలవారు. పిరికితనం అంటే ఏమిటో తెలియదు. అందుకే వీరిని ఆంధ్రకేసరి అంటారు. అంటే 'తెలుగు సింహం' అన్నమాట. బాగుందికాదూ పేరు! చూస్తే అలాగే ఉంటుంది ఆ ముఖం.

డాక్టరు పట్టాభి సీతారామయ్యగారు ఉన్నారు. ఆయనచాలా తెలివిగలవారు. జాతీయ కాంగ్రెసుచరిత్ర వ్రాశారు. బ్యాంకులు స్థాపించారు. బందరులో ఆంధ్రజాతీయ కళాశాల స్థాపించారు. కాంగ్రెసు పెద్దలలో ఒకరు. జైలుకుకూడా వెళ్లారు.

కొండా వెంకటప్పయ్యగారిని చూశావా? చాలా ముసలాయన. ఎప్పటినుంచో ఆంధ్రులకు వేరే రాష్ట్రంకావాలనీ, తెలుగువారందరూ కలసిమెలసి ఒక రాష్ట్రంలోనే వుండాలనీ, స్వరాజ్యం కావాలనీ పాటుపడుతున్నారు. ప్లీడరుపని 30 సంవత్సరాలక్రితం మానేసి అప్పటినుంచి పేదలకోసం పాటుపడుతున్నారు. ఎన్నో సారులు జైలుకు వెళ్ళారు. గాంధిగారి శిష్యులు. గాంధిగారు వీరిని "దేశభక్త" అని పిలుస్తారు.

న్యాపతి సుబ్బారావుపంతులు మనకి భీష్ముడువంటివాడు. ఆంధ్ర మహాసభలోను, కాంగ్రెసులోను చాలాకాలం పనిచేసిన తెలుగుతాత.

ఉన్నవ లక్ష్మీనారాయణగారు గుంటూరులో వున్నారు. బారిస్టరు. మంచి పుస్తకాలు వ్రాశారు. పూర్వం ఆయనను

# తెలుగు ప్రధాన మంత్రులు



బొబ్బిలి రాజా



మునుస్వామి నాయుడు

వేలూరు జైలులో పెట్టినప్పుడు "మాలపల్లి" అనే గొప్ప నవల వ్రాశారు. గొప్ప దేశభక్తులు. వీరు, వీరిభార్య ఉన్నవ లక్ష్మీ బాయమ్మగారు 'శారదానికేతనం' అనే గొప్ప ఆడపిల్లల స్కూలు పెట్టి నడుపుతున్నారు గుంటూరులో.



దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

రంగాగారు ఆయనభార్య భారతీదేవి రంగాగారు రైతులమంచికోసం ఎంతో కష్టపడి పనిచేస్తున్నారు.

రాజమండ్రిలో దామెర్ల రామారావుగారు అనే గొప్ప చిత్రకారులు, అంటే బొమ్మలు చకవాగా వేసేవారు, ఉండేవారు. చిన్నతనం లోనే పోయినారు.

ఆంధ్రరత్న గోపాల కృష్ణయ్యగారు పండితులు. కాంగ్రెసు కార్యదర్శిగా పని చేశారు.

బందరులో జాతీయ కళాశాల పెట్టి కోపల్లి హనుమంతరావుగారు గొప్పపని చేశారు. వీరిని మనం మర్చిపోలేం.

మనదేశంలో విజయనగరం, జయపురం, పిఠాపురం,

వుయ్యూరు, వెంకటగిరి రాజులు, జమీందారులు స్కూళ్ళు, కాలేజీలు పెట్టి విద్యాభివృద్ధికి సహాయంచేశారు.

మన తెలుగువారు చాలామంది ప్రధాన మంత్రులుగాను, మంత్రులుగాను పనిచేశారు. ప్రధాన మంత్రులుగా పనిచేసినవారు బొబ్బిలిరాజా, పానగల్‌రాజా, మునుస్వామి నాయుడుగార్లు. మంత్రులుగా పనిచేసినవారు సర్. కూర్మారెడ్డి నాయుడుగారు, పాత్రోగారు, గోపాలరెడ్డిగారు. ఇప్పుడు గిరిగారు, కూర్మయ్యగారు మంత్రులుగా వున్నారు.

విశ్వవిద్యాలయాధికారులుగా పేరుకెక్కిన రాధాకృష్ణ, రామలింగారెడ్డిగార్లను గూర్చి ఇదివరకే చెప్పానుగదా !

ఆడవాళ్ళలో అన్నపూర్ణాదేవి గాంధీగారు 1920 లో ఆంధ్రదేశం వచ్చినప్పుడు వేయి రూపాయిల బట్టలు, రెండు వేల రూపాయల నగలు ఆయనకు ఇచ్చారు. చదువుకొన్న స్త్రీలలో ఈమెయే మొదట కాంగ్రెసులో చేరి గాంధీగారి ప్రథమ పుత్రిక అని పేరు పొందారు.



మాగంటి అన్నపూర్ణాదేవి

శ్రీమతి రామసుబ్బమ్మగారు కడప జిల్లాబోర్డు ప్రెసిడెంటు పని చేశారు. డాక్టరు లాజరసుగారు ఢిల్లీలో మెడికలు కాలేజీకి ప్రిన్సిపాలుగా పనిచేస్తున్నారు.

నెల్లూరులో పొణకా కనకమ్మగారు బాలికల విద్యాభివృద్ధికి చాలా పనిచేస్తున్నారు.

దువ్వూరి సుబ్బమ్మగారి పేరు విన్నావా? ఈమె కాంగ్రెసులోచేరి మొదట జైయికి వెళ్లిన దేశసేవకురాలు. "దేశబాంధవి" అని పేరు పొందారు. ఈ అవ్వగారు బాగా ఉపన్యాసాలు ఇస్తారు.

ఆచంట రుక్మిణమ్మగారు, డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారి భార్య. ఈమె ఇప్పుడు మదరాసు మంత్రిగా పనిచేస్తున్నారు. స్త్రీల అభివృద్ధికిగాను చాలా పాటుపడినారు. డాక్టరు లక్ష్మీపతిగారు వైద్యశాస్త్రం బాగా చదివి, ఆయుర్వేద వైద్యం మన దేశంలో బాగా వాడుకలోనికి తెచ్చారు.

ఇంకా స్త్రీలలో మన తెలుగుభాషకు దేశానికి సేవజేసన వారు—స్త్రీల కళాశాలకు ప్రిన్సిపాలుగా పనిచేస్తున్న బత్తుల కామాక్షమ్మగారు, పెద్దాడ కామేశ్వరమ్మగారు, బందారు అచ్చమాంబగారు, కాంచనపల్లి కనకమ్మగారు, - ఇంకా ఎంతమందో గలరు.

ఇలా మన తెలుగుదేశంలో - దేశంకోసం ప్రాణాలు ఇచ్చిన దేశభక్తులు, భాషాసేవచేసిన కవులు, పండితులు, అధికారంచేసిన గవర్నరులు, మంత్రులు, యుద్ధంలో బాగా పోరాడిన వీరులు, సంగీతం బాగాపాడే గాయకులు, భీముడిలా బలంగల వారు ఎంతోమంది వున్నారు.

మరి నీసంగతో? నీకిప్పుడు చిన్నవయస్సు. ఎంతకాలమో బ్రతకాలి. నీదేశానికి, సంఘానికి, భాషకి సేవచెయ్యాలి. తెలిసిందా?

# వి శ్వ దా త



కీ॥ శే॥ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు

# మన పెద్దలు



దేశభక్త కొండా వెంకటప్పయ్య ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు

# మన నాయకులు



ఆంధ్రకేసరి
టంగుటూరి ప్రకాశం.
మద్రాసు ప్రభుత్వ
ప్రధాన మంత్రి.



డాక్టరు భోగరాజు
పట్టాభి సీతారామయ్య.





## విజయలక్ష్మి పండిట్

ఈమె జవ్హారులాలు నెహ్రూ సోదరి. మనదేశం రాయబారిగా అమెరికా వెళ్లి అక్కడ ప్రచారం చేస్తోంది. ఇదివరలో మంత్రిగా పనిచేశారు.



ఈమె మన తెలుగు వారి కోడలు

## సరోజినీ నాయుడు

కాంగ్రెసు ప్రెసిడెంటుగా పనిచేశారు. గొప్ప దేశ సేవకురాలు. జైలుకు కూడా వెళ్లారు. ఇంగ్లీషులో పెద్ద కవి.

తెలుగు బాలికలు వీరివలె గొప్పవారు కావాలి.

# నేర్చుకోవలసినది



రావిచెట్టుకు, మర్రిచెట్టుకు పెద్ద కొమ్మలు ఉంటాయి గదా! అవి పొడుగుగానో, తిన్నగానో, వంకరగానో లావుగా పెరిగి అన్ని వైపులకు ఎదుగుతాయి. కాని లేత మొక్కగా ఉండగా ఆ కొమ్మ నువ్వు ఎలా వంచితే అల్లా వంగుతుంది. వంకరగా పెరిగి మాను అయిన తరువాత దానిని ఎవరూ వంచలేరు. నువ్వూ అంతే. చిన్న బిడ్డవి గనక నీమనస్సు మెత్తగా వుంటుంది. మెత్తని మట్టితో, చూడు కుమ్మరివాడు బొమ్మలు, కుండలు ఎన్ని రకాలుగానో తయారుచేస్తాడు. అదేవిధంగా చిన్నప్పుడు మీ అమ్మ, నాన్న ఎంతచక్కగా పెంచితే నువ్వు పెద్దవాడవు అయినతరువాత అంత తెలివిగలవాడివి, మంచివాడివి అవుతావు. చిన్నప్పుడే నీ మనస్సును మీ అమ్మ, నాన్న మంచిదానిగా తయారుచేస్తారు. అంతేకాదు నీ క్లాసులో నీ స్నేహితులనుబట్టి, నువ్వు చదివే పుస్తకాలను బట్టి కూడా నీ మనస్సు మంచిదిగానో, చెడ్డదిగానో తయారవుతుంది. ఠాగూరు, గాంధీలాంటి గొప్పవాళ్లు చిన్నప్పుడు వాళ్ళ అమ్మ, అక్క చెప్పిన మంచిమాటలవలన మంచివాళ్లు అయారు.

మీదొడ్లో ఏ గింజలు పాతిపెడితే ఆరకం మొక్కలే మొలుస్తాయి. ఇప్పుడు నీ మనస్సులో ఏ ఉద్దేశాలు నాటితే అవే

మొలకెత్తి నువ్వు పెద్దవాడవు అయిన తరువాత పెరిగి పెద్దవై పూవులుపూసి కాయలు పళ్లు పండుతాయి. అందుకే నువ్వు మంచి మాటలు వినాలి. మంచివాళ్లతో సహవాసంచెయ్యాలి. మంచి పుస్తకాలు చదవాలి. బ్రతికినన్నాళ్లు బాగా బ్రతకాలి. మంచివాడవు అనిపించుకోవాలి. ప్రహ్లాదుడు చూశావా! చిన్నతనంలోనే దైవభక్తి కలిగి పట్టుదలగలిగి ఉండేవాడు. మార్కండేయుడు అనే కుర్రవాడు 16 ఏండ్లకే తపస్సుచేసి చావును తప్పించుకున్నాడు. ధ్రువుడు అనే బాలుడు తన సవతి తల్లి అగౌరవంచేస్తే అడవికి వెళ్ళి తపస్సుచేసి గొప్పవాడు అయాడు.



స్వామి వివేకానంద

శంకరాచార్యులు 15ఏళ్ళలోపలనే అన్ని విద్యలు నేర్చుకున్నాడు. 32 సంవత్సరాలకే ఇండియా అంతటా తిరిగి మతాన్ని బోధించాడు. స్వామి వివేకానంద చిన్న వయస్సులోనే అమెరికా వెళ్ళి మనమతం బోధించాడు. ఇల్లా వీళ్లందరు గొప్పవాళ్లు అయినట్టే నువ్వూ కావచ్చును. నీపేరు అందరు చెప్పుకుంటారు.

నీకు ఆలాంటి గొప్పకోరికలు ఉండాలి. పట్టుదల వుండాలి. పనిచెయ్యాలి.

అన్నింటికంటె ముఖ్యం - నీకు క్రమశిక్షణ వుండాలి. వేళకు నిద్రలేవాలి. వేళకు తిండితినాలి. ఆటలు, పాటలు, నిద్ర, చదువు - దేనికీ వేళ తప్పనీయకూడదు. నీ బట్టల్ని, శరీరాన్ని పరిశుభ్రంగా వుంచుకో. రోజూ కసరతుచెయ్యి. శుభ్రమైన ఆహారం కావలసినంతే తిను.

చదువుకొని గొప్పవాడివి కావాలి అనే పట్టుదలతో శ్రద్ధగా మనస్సును ఇటు - అటు చెదరిపోనీయకుండా చదువుకో. అలాచేస్తేనే చదివింది బాగా జ్ఞాపకం వుంటుంది. మంచి పాటలు కూడా నేర్చుకో. చక్కని దస్తూరి వ్రాయడం నేర్చుకో—లేకపోతే నువ్వువ్రాసింది చదవడానికి అందరు అసహ్యించుకుంటారు.

మనస్సులో చెడ్డ ఆలోచనలు వుండకూడదు. అందరికి మంచినికోరు. ఎవరిని తిట్టరాదు. ఇతరులు నీకంటె తక్కువ అని, పేదవాళ్ళు అని అనుకోరాదు. ఒకటేదేశం మనది. ఒకటేజాతి మనది. కూలీవాళ్ళు, పేదవాళ్ళు, సాయిబులు, క్రైస్తవులు, అందరం ఒకటే అనుకొని సమానంగా చూడాలి. రోజూ భగవంతుణ్ణి:—

"పరమపితా మా ప్రార్థన వినరా !
పాపము లోబడనీయకురా

పరులను మావలె భావించెడు మది పర
మాత్మా ! మా కొసగుమురా !"

అని ప్రార్థించాలి. ప్రహ్లాదుడు చూడు

"తనయందు అఖిల భూతములందు నొకభంగి
సమహితత్వంబున జరుగువాడు"

చూశావా ! ఎంత మంచివాడో ! తనెలా సుఖంగా ఉండాలి అను కుంటాడో అందరు, అన్ని జంతువులు, పక్షులుకూడా అలా తనతో సమానంగా సుఖంగా ఉండాలి అనుకునే వాడుట !

పిరికితనం పనికిరాదు. నెమ్మది, ధైర్యం ఉండాలి. పెద్ద పులి ధైర్యం, సింహపు పరాక్రమం, ఏనుగు బలం, గుఱ్ఱపు నడక, చందమామ చల్లదనం నీకుకూడా ఉండాలి. హృదయం వెన్నలా మెత్తగాను, మనస్సు వజ్రంలా గట్టిగాను వుండాలి. సోమరిపోతులతో కలిసి తిరగటం, చీట్లపేక ఆడటం చాలా తప్పు. చీమలు చూశావా ఎప్పుడూ ఎల్లా పాటుపడతాయో ! నీవు పుట్టిన దేశం, నిన్ను పెంచినదేశం, నీకు పాడి పంటలను ఇచ్చి పోషించు తూన్నదేశం అంటే నీకు ప్రేమ, భక్తి వుండాలి అని చెప్పాను కాదూ ! దేశభక్తి లేనివారు బ్రతికివున్నా చనిపోయినా ఒకటే. దేశనాయకులను దేశ వీరులను పూజించాలి. వారు ఎందుకు అంత గొప్పవారు అయారు? దేశానికి ఏంచేశారు? మనము ఏంచెయ్యాలి? ఏమిచెయ్యగలం ? మనంకూడా వాళ్లంతవాళ్ళం ఎందుకు కాకూడదూ ? ఆలోచించు. శ్రద్ధగా ఆలోచించు !

ఈపాట ఎంత బాగున్నదో చూడు :—

ఏ దేశమేగినా ఎందు కాలిడిన
ఏపీఠమెక్కినా ఎవ్వరెదురయిన
పొగడరా నీ మాతృభూమి భారతిని
నిలుపరా నీజాతి నిండు గర్వమ్ము.
లేదురా ఇటువంటి భూదేవి యెందు
లేదురా మనవంటి ధీరు లింకెందు !

ఏపూర్వ పుణ్యమో ఏయోగబలమొ
జనియించి నాడ వీ స్వర్గలోకమున
ఏ మంచి పూవులన్ ప్రేమించినావొ
నిను మోచె నీ తల్లి కనక గర్భమున

అవమానమేలరా అవమానమేల
భారత పుత్రుడనంచు భక్తితో పలక !

ఈ గీతం శ్రీ రాయప్రోలు సుబ్బారాయ కవిగారు వ్రాసినది. గురజాడ అప్పారావు గారనే గొప్ప కవి వుండేవాడని చదువు కొన్నావుగా ! ఆయన 40 సంవత్సరాలకు పూర్వమే ఎంత మంచి పాటవ్రాశారో చూడు:—

"దేశమును ప్రేమించుమన్నా !
మంచి అన్నది పెంచుమన్నా !
వట్టి మాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్.

"ఉత్తిష్ఠత జాగ్రత
ప్రాప్య వరాన్నిబోధత"

**లేవండి. మేలుకొనండి. పొందదగిన కోరికను తెలుసుకొనండి.**

## వీరెవరో తెలుసా?



వీరే కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగం పంతులుగారు,

తెలుగుజాతి బాగుకు మూలపురుషుడు.

"నమస్కారాం తాతా! నమస్కారం!
నిన్ను మరచిపోము."



## లోకోత్తర పురుషుడు

---

నిద్రలోవున్న మనదేశాన్ని
మేలుకొలిపి, మనకు
స్వరాజ్యం తెస్తూన్న
మన నాయకుడు
మహాత్మా గాంధీ.





నమస్తే బాపూజీ!





కీ॥ శే॥ కస్తురిబా గాంధీ

మానవసేవకొరకై పుట్టిన
మహాత్మునికి సరియైన
భార్యయై, దేశసేవచేస్తూ,
జైలులో మరణించిన,
మనమాత
కస్తురిబా.



# తెలుంగు దేశం మనదేనోయ్

తెలుంగు దేశం - మనదేనోయ్
తెలుంగు లంటే - మనమేనోయ్
మధురం మధురం - మధురం మధురం
ఆంధ్రం అంటే - అతిమధురం
దేశభాషల - తీరుల్లోకీ
ఆంధ్రమ్మంటే అతిమధురం. ॥తె॥

రాయలు మన వాడోయ్ - పండిత -
రాయలు మనవాడోయ్
కలం తిక్కనా - ఖడ్గ తిక్కనా
గణపతి దేవులు - మనవారోయ్. ॥తె॥

అమరావతి నా - గార్జున కొండా
సిద్ధహస్తులా - శిల్పాలోయ్
మల్లినాథ కు - మారిల భట్టులు
అందెవేసినా - హస్తాలోయ్. ॥తె॥

విద్యానగరం - వీరబొబ్బిలి
ద్రాక్షారామం - క్షీరారామం
గన్నవరము కో - టప్ప మహేంద్రం
కాళహస్తి మం - గళగిరి క్షేత్రం
మనవేనోయ్ - మనవేనోయ్
మనవేనోయ్ - మనవేనోయ్. ॥తె॥

మచిలీ పట్నం - మద్రాస్ నగరం
కాకపురీ వి - శాఖపురీ
విజయాద్రీ భద్రాద్రీ
వేదాద్రీ మనవేనోయ్

సింహాద్రీ శేషాద్రీ
శ్రీశైలం మనవేనోయ్. ॥తె॥
గోదావరి కృష్ణా
తుంగభద్ర పెన్నా
కావేరీ పంపా
కని పెంచినవోయ్
తెలుంగు జాతిని
వినిపించినవోయ్
వీణా నాదం ॥తె॥
ఓడలు కట్టేమూ - మింటికి -
మేడలు కట్టేమూ
మున్నీరంతా - ఏకరాశిగా
ముద్దరవేశామూ
సంతలోన వ - జ్రాలరాసులూ
జలజల రాలినవీ;
కుబేరతుల్యం
మహదైశ్వర్యం
గొడుగు పట్టినాదీ.... ॥తె॥
గణ గణ గణ గణ
గణ గణ గణ గణ
తెలుంగు జయ ఘంటా—
గణ గణా గణా గణ
గణా గణా గణ
తెలుంగు జయ ఘంటా—
తెలుంగుదేశం - మనదేనోయ్
తెలుంగులంటె - మనమేనోయ్. ॥తె॥
—శ్రీ సుబ్బరామశాస్త్రి.

స్కూళ్లలోను, మీటింగులలోను పాడే 'వందేమాతరం' పాట వచ్చునా? నేర్చుకో. అది పాడి మన ఆంధ్రదేశానికి మంగళ గీతం పాడు.



ఆంధ్రమాత శ్రీసమేత
అనుపమ ప్రపూతచరిత
అఖిలభక్త పారిజాత
అమల మంగళం!

మొల్లముఖ్య కవయిత్రుల
మల్లమాది సాధ్వీమణుల
అల రుద్రమదేవి గన్న
తల్లి మంగళం!

రామదాసాది భక్త
రత్నములను గన్నతల్లి
వల్లభాది మతకర్తల
తల్లి మంగళం!

తిమ్మరుసు యుగంధరాది
దివ్య రాజనీతిపరుల
నన్నయాది కవులగన్న
తల్లి మంగళం!

—జై! ఆంధ్రమాతకు జై!!

PRINTED AT THE B. N. K. PRESS, MADRAS Q. H. NO. MS 100/B.
FOR M. BAPINEEDU—Q. H. NO. MS. 405/D. 5000—11-'46.

ఇదిగో! మీ అఖిలాంధ్రదేశం!



